# నిరశనార్క వ్రతము

జపాకుసుమసంకాశం కాశ్యపేయం మహోద్యుతిం,
తమోఽరిం సర్వపాపఘ్నం ప్రణతోఽస్మి దివాకరమ్.
రవిర్వినాయకశ్చండీ మహేశో విష్ణుదేవశ్చ,
అనుక్రమేణ పూజ్యంతే సర్వకామార్థసిద్ధయే.

శ్రీసూర్యనారాయణుని సంప్రీతికి చేసే వ్రతము ఇది. సూర్య భగవానుడు యీ ప్రపంచానికి క్రాంతిని కాంతిని ఇచ్చే మహానుభావుడు. సర్వ ప్రకృతికి మూలకారకుడు. ఆయన ఉనికి లేనిదే యీ ప్రపంచం మనుగడ లేదు. అరుణ, ఆదిత్య, ఉదయ, భాస్కర, భాను అనునవి ఆయనకు ఇతర పేర్లు. పై శ్లోకంలో చెప్పినట్లు రవి, వినాయక, చండి, మహేశ, విష్ణుదేవుల అనుగ్రహాన్ని వారికి తగిన విధంగా పూజ చేయడం వల్ల పొందవచ్చు. తమ అభీప్సితము నెరవేర్చుకోవచ్చు.

మానవులను పవిత్రం చేయగలిగిన ఒక వ్రతమును గురించి తెలియజేయుమని పార్వతీదేవి అడగడంతో పరమేశ్వరుడు యీ నిరశనార్క వ్రతాన్ని గూర్చి చెప్పి, ఒకప్పుడు బ్రహ్మదేవుడు కూడ యీ వ్రతాన్ని చేశాడని సెలవిచ్చారు. ఈ వ్రతం చేయడం అంటే సూర్యభగవానుని పూజించడమే. ఆదివారం అంటే రవివారం మూడు సంవత్సరాలపాటు వరుసగా ఉపవాసం వుండాలి.

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించే శుభగడియలో యీ వ్రతం ప్రారంభించడం మేలు. అదికూడ ఆదివారం అయితే ఇంకా మంచిది. పుష్యమాసం శుక్లపక్షం 7వ రోజు ఆదివారం సూర్యుడు మకర రాశిలో ప్రవేశించే రోజు అయితే అత్యుత్తమమైనది. ముందుటి రోజు శనివారం ఒక్కపూట భోజనం చేసి ఆదివారం విఘ్నేశ్వరునికి మొదట పూజచేసి తదుపరి సూర్యభగవానునికి యీ వ్రతం చేయాలి. ఆయన భార్యలు ఛాయ, సంజ్ఞలకు ప్రత్యేకంగా పూజ చేయాలి. గృహిణి ఈ వ్రతాన్ని భర్తతోబాటు చేయాలి.

ఈ వ్రతంలో ఏడురకాల పత్రములు, ఎనిమిది రకాల పూలు మంత్ర పూర్వకముగా వాడాలి. ఈ వ్రతం ఆదివారం ప్రొద్దునే హంసమంత్రముతో ప్రారంభించేసి రోజంతా వుపవాసంతో గడపాలి.

## పత్రపూజ

| | | | | చెట్టు నంబరు |
|---|---|---|---|---|
| 1. | ఓం సూర్యాయ నమః | బిల్వపత్రం (మారేడు) | సమర్పయామి | 13 |
| 2. | ఓం భగాయ నమః | మందారపత్రం (దాసాని) | " | 53 |
| 3. | ఓం అర్కాయ నమః | మాచీపత్రం (దవనం) | " | 49 |
| 4. | ఓం భాస్కరాయ నమః | తులసీపత్రం (తులసి) | " | 81 |
| 5. | ఓం రవయే నమః | అర్కపత్రం (జిల్లేడు) | " | 7 |
| 6. | ఓం ఆదిత్యాయ నమః | శమీపత్రం (జమ్మి) | " | 69 |
| 7. | ఓం భానవే నమః | శతపత్రపత్రం (పద్మం) | " | 70 |

ఓం దినమణియే నమః పత్రపూజాం సమర్పయామి.

## పుష్పపూజ

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఓం మిత్రాయ నమః | మాలతీపత్రం (మాలతి) | సమర్పయామి | 51 |
| 2. | ఓం జగత్ చక్షుషే నమః | మందారపుష్పం (దాసాని) | " | 53 |
| 3. | ఓం సతీస్తుతాయ నమః | కరవీరపుష్పం (గన్నేరు) | " | 41 |
| 4. | ఓం వేదజీవాయ నమః | సేవంతికాపుష్పం (చామంతి) | " | 68 |
| 5. | ఓం వివస్వతే నమః | వకుళపుష్పం (పొగడ) | " | 85 |
| 6. | ఓం హిరణ్యగర్భాయ నమః | దత్తూరపుష్పం (దత్తూర) | " | 20 |
| 7. | ఓం ప్రభాకరాయ నమః | ద్రోణపుష్పం (తుమ్మి) | " | 25 |
| 8. | ఓం మరీచయే నమః | కమలపుష్పం (కమలం) | " | 38 |

అరుణఛాయా సంజ్ఞాసమేత శ్రీసూర్యనారాయణ స్వామినే నమః

పుష్పపూజాం సమర్పయామి.

# నారాయణపూజ

## పత్రి

| | | | | |
|---|---|---|---|---|
| 1. | సత్యేశ్వరాయ నమః | ఆమలకపత్రం (ఉసిరి) | సమర్పయామి | [illegible] |
| 2. | సత్యశౌర్యాయ నమః | అపామార్గపత్రం (ఉత్తరేణి) | " | 5 |
| 3. | లక్ష్మీవల్లభాయ నమః | అర్జునపత్రం (తెల్లమద్ది) | " | 6 |
| 4. | సత్యవేదాయ నమః | బదరీపత్రం (రేగు) | " | 11 |

| | | | | |
|---|---|---|---|---|
| 5. | అనంతాయ నమః | భృంగరాజపత్రం(గుంటగలగర) | సమర్పయామి | 12 |
| 6. | సత్యసంకల్పాయ నమః | బిల్వపత్రం (మారేడు) | " | 13 |
| 7. | సత్యవిభవాయ నమః | చంపకపత్రం (చంపక) | " | 15 |
| 8. | సత్యపూర్ణాయ నమః | చూతపత్రం (మామిడి) | " | 18 |
| 9. | సత్యసంతుష్టాయ నమః | దాడిమీపత్రం (దానిమ్మ) | " | 19 |
| 10. | సత్యౌషధాయ నమః | దేవనపత్రం (దవనపత్రం) | " | 21 |
| 11. | సత్యాచ్యుతాయ నమః | దేవదారుపత్రం (దేవదారు) | " | 22 |
| 12. | సత్యాధీశాయ నమః | దూర్వపత్రం (గరిక) | " | 24 |
| 13. | హలాయుధాయ నమః | ద్రోణపత్రం (తుమ్మి) | " | 25 |
| 14. | సత్యపారాయణాయ నమః | ఇరువంతికపత్రం (మల్లి) | " | 29 |
| 15. | సత్యాత్మనే నమః | జాజీపత్రం (జాజి) | " | 30 |
| 16. | సత్యవపుషే నమః | కమలపత్రం (కమలం) | " | 38 |
| 17. | సత్యోధరాయ నమః | కరవీరపత్రం (గన్నేరు) | " | 41 |
| 18. | సత్యకామాయ నమః | మాచీపత్రం (దవనం) | " | 49 |
| 19. | సత్యేష్మయ నమః | మల్లికాపత్రం (మల్లి) | " | 52 |
| 20. | సత్యసేవ్యాయ నమః | మరువకపత్రం (మరువం) | " | 54 |
| 21. | సత్యదక్షాయ నమః | పారిజాతపత్రం (పారిజాతం) | " | 64 |
| 22. | సత్యరూపాయ నమః | సేవంతికాపత్రం (చామంతి) | " | 68 |
| 23. | సత్యవర్మాయ నమః | శమీపత్రం (జమ్మి) | " | 69 |
| 24. | వామనాయ నమః | శతపత్రపత్రం (పద్మం) | " | 70 |
| 25. | శ్రీకేతనాయ నమః | శ్రీగంధపత్రం (శ్రీగంధం) | " | 71 |
| 26. | శ్రీసత్యదేవాయ నమః | తులసీపత్రం (తులసి) | " | 81 |
| 27. | సత్యానందాయ నమః | వటపత్రం (మర్రి) | " | 86 |
| 28. | సత్యాగ్రహరూపిణే నమః | వేణుపత్రం (వెదురు) | " | 87 |
| 29. | సత్యధర్మాయ నమః | విష్ణుక్రాంతపత్రం (విష్ణుక్రాంత) | " | 88 |

# నారాయణపూజ

## పుష్పాలు

| | | | | చెట్టు నంబరు |
|---|---|---|---|---|
| 1. | సత్యధర్మాయ నమః | అశోకపుష్పం (అశోక) | సమర్పయామి | 8 |
| 2. | సత్యకామాయ నమః | అతసీపుష్పం (సీమఅవిశ) | " | 10 |
| 3. | సత్యనిధయే నమః | చంపకపుష్పం (చంపక) | " | 15 |

| | | | | |
|---|---|---|---|---|
| 4. | సత్యౌషధాయ నమః | దాడిమీపుష్పం (దానిమ్మ) | సమర్పయామి | 19 |
| 5. | సత్యానందాయ నమః | దేవదారుపుష్పం (దేవదారు) | " | 22 |
| 6. | సత్యధర్మాయ నమః | గిరికర్ణికాపుష్పం (శంఖపుష్పం) | " | 28 |
| 7. | సత్యోధరాయ నమః | ఇరువంతికాపుష్పం (మల్లె) | " | 29 |
| 8. | సత్యాత్మనే నమః | జాజీపుష్పం (జాజి) | " | 30 |
| 9. | సత్యరూపాయ నమః | కల్హారపుష్పం (తామర) | సమర్పయామి | 37 |
| 10. | సత్యగ్రహరూపిణే నమః | కమలపుష్పం (కమలం) | " | 38 |
| 11. | సత్యదేవాయ నమః | కరవీరపుష్పం (గన్నేరు) | " | 41 |
| 12. | సత్యసంతుష్టాయ నమః | కేతకీపుష్పం (మొగలి) | " | 43 |
| 13. | సత్యంతాయ నమః | కుందపుష్పం (మొల్లలు) | " | 46 |
| 14. | సత్యాక్షయాయ నమః | మాలతీపుష్పం (మాలతి) | " | 51 |
| 15. | సత్యవర్మాయ నమః | మల్లికాపుష్పం (మల్లి) | " | 52 |
| 16. | సత్యదీక్షాయ నమః | మందారపుష్పం (దాసాని) | " | 53 |
| 17. | సత్రేష్మయాయ నమః | పారిజాతపుష్పం (పారిజాతం) | " | 64 |
| 18. | సత్యాచ్యుతాయ నమః | పాటలీపుష్పం (కలిగొట్టు) | " | 65 |
| 19. | సత్యపూర్ణాయ నమః | పూగపుష్పం (పోక) | " | 66 |
| 20. | సత్యనారాయణాయ నమః | పున్నాగపుష్పం (పొన్న) | " | 67 |
| 21. | సత్యసేవ్యాయ నమః | సేవంతికాపుష్పం (చామంతి) | " | 68 |
| 22. | సత్యాధిపాయ నమః | శతపత్రపుష్పం (పద్మం) | " | 70 |
| 23. | సత్యవపుషే నమః | సుగంధరాజపుష్పం (సుగంధరాజ) | " | 73 |
| 24. | సత్యసంకల్పాయ నమః | వకుళపుష్పం (పొగడ) | " | 85 |

# లక్ష్మీపూజ

## పత్రి

| | | | | చెట్టు నంబరు |
|---|---|---|---|---|
| 1. | శుభప్రదాయై నమః | బిల్వపత్రం (మారేడు) | సమర్పయామి | 43 |
| 2. | మహాలక్ష్మ్యై నమః | మాచీపత్రం (దవనం) | " | 49 |
| 3. | మాయాయై నమః | మరువకపత్రం (మరువం) | " | 54 |
| 4. | క్షేమంకరాయై నమః | సేవంతికాపత్రం (చామంతి) | " | 68 |
| 5. | త్రిపురసుందర్యై నమః | తులసీపత్రం (తులసి) | " | 81 |
| 6. | విష్ణుప్రియాయై నమః | విష్ణుక్రాంతపత్రం (విష్ణుక్రాంత) | " | 88 |

# వనదేవాలయాలు

వనదేవత లేదా వనలక్ష్మి మనపాలిటి వరలక్ష్మి. ఆమెయే మన అదృష్టలక్ష్మి మరియు అనంతలక్ష్మి. ఆమె లేనిదే మన వునికి ఊహించరానిది.

ఆలయం నిర్మించి అందులో దేవుని ప్రతిష్ఠించితే అది దేవాలయము. భగవంతుని ప్రతీకలుగా విగ్రహాలకు బదులు చెట్లునాటితే అది దేవారామం. ఈ దేవారామములే మన దేవాలయాలు, దివ్యారామములు.

ప్రకృతికి పరమాత్మునికి అవినాభావసంబంధ ముంది. నిజానికి వారిద్దరూ వేరు కారు. చెట్లు, ఆకులు, పూలు ఇవన్నీ భగవంతుని ప్రతీకలే. ఒక్కొక్క చెట్టు ఒక్కొక్క దేవునికి ప్రీతిపాత్రమయినది. దాని ఆకులు, పూలు కూడ అంతే. ఆ యా దేవునికి నిర్దేశింపబడిన వాటితోనే పూజ జరుగుతుంది.

అంతేకాదు. ఆకులు, పూలు లేకుండా ఏ శుభకార్యం జరుగదు. ఏ పూజా జరుగదు. పూలు లేకుండా ఏ దేవతావిగ్రహం కానీ, ఏ దేవుని పటం కానీ కనబడదు. కనపడినా అవి చూడటానికి మనస్కరించదు.

రామాయణ, మహాభారత, భాగవతాది మహా కావ్య, పురాణాలలో ఎన్నో దివ్యవనాల ప్రస్తావన వుంది. రామాయణంలో చిత్రకూటం, పంచవటి, అశోకవనము, ఋష్యమూకము, కిష్కింధ, మధువనం వగైరాలు. మహాభారతంలో ఖాండవవనము, ద్వైతవనం, కణ్వాశ్రమము, దండకారణ్యం మొదలగునవి. మహాభాగవతములో నైమిశారణ్యం, బృందావనం ఇలా ఎన్నో పవిత్రవనాలను గురించిన ప్రస్తావన వుంది.

కృష్ణుడు బృందావన సంచారి. వనమాలి, కుంజవిహారి అని ఆయనను కీర్తిస్తారు. వేణుమాధవుడు, గిరిధారి, గోపాలకృష్ణుడు ఇలా ఆయనను ఎన్ని పేర్లతో పిలిచినా ప్రతిపేరు ప్రకృతికి సంబంధించినదే. రాముడు కృష్ణుడు నిత్యమాలాధారులు. విష్ణువు చేతిలో నిత్యపద్మం వుంటుంది. లక్ష్మీదేవి పద్మాసనస్థిత. ఆమె రెండు చేతులలోనూ కమలాలుంటాయి. ఈశ్వరుడు బిల్వపత్రాలలో ఎప్పుడూ మునిగి వుంటాడు. సూర్యుని చూస్తూనే పద్మాలు వికసిస్తాయి. ఇలా ఎన్నో సంబంధాలు.

సృష్ట్యాదిలో విష్ణుమూర్తి బాలకుడై దిసమొలతో మఱ్ఱి ఆకుమీద పడుకొని పాలసంద్రము మీద తేలియాడటం మన మెన్నో చిత్రాలలో చూశాము.

అందుకే ఆయనకు వటపత్రశాయి అని పేరు. మఱ్ఱికి బదులు కొన్ని చోట్ల రావి ఆకు అన్నారు. రావిచెట్టు లేదా అశ్వత్థము కూడ వటము అని పిలువబడుతుంది. అలా పడుకొని వున్న అతని బొడ్డులో ఒక తామరపుష్పం మొలిచింది. ఆ పుష్పంలోంచి బ్రహ్మదేవుడు పుట్టాడు. తరువాత సృష్టికి పూనుకొన్నాడు. ఇదీ కథ. దీనికి ఆకులతో, పుష్పాలతో ఎంతో సంబంధ ముంది.

రావిచెట్టు—వేపచెట్టుకు పెండ్లిచేసి వీలయితే వాటినీడన నాగబంధం ప్రతిష్ఠించి రచ్చ చుట్టూ తిరిగితే సంతానం కలుగుతుందని మనవారి విశ్వాసం. రావిచెట్టు స్త్రీజాతికి ప్రతీక. వేపచెట్టు పురుషజాతికి ప్రతీక. ఆకుల రూపాన్ని బట్టి యీ విభజన జరిగివుంటుంది. అయినా విష్ణుమూర్తి, యీ అశ్వత్థంలో నివశిస్తూ వుంటారని మన విశ్వాసం. అంతేకాదు, యీ రావిచెట్టు హిందువులకే కాక బౌద్ధులకు కూడ పవిత్రమయినది.

దశావతారాలలో ఒకటయిన బుద్ధావతారం, బుద్ధుడు కావటానికి యీ రావిచెట్టే కారణం. గౌతముడు దీనిక్రింద తపస్సు చేసి బుద్ధు డయినాడు. కావున ఈ చెట్టుకు బోధివృక్షమని కూడ పేరు వచ్చినది.

విష్ణుమూర్తి రావిచెట్టులో నివసించినా తులసి అంటే ఆయనకు ప్రాణం. పూలతో కలిసిన తులసి హారం ఆయన మెడలో నిరంతరం వుంటుంది. అందుకే ప్రతి హిందువు ఇంట్లో తులసీకుండం విధిగా వుంటుంది. నిత్యం పూజచేస్తూ వుంటారు.

ఈ పత్రాలు పూలు కేవలం ధరించడానికే కాదు. మన్మథుడు వీటిని బాణాలుగా వుపయోగించేవాడు, బాణాలు ఎలా ఏ యే ఆకులు, పూలతో నిర్మింపబడేవో మరొక చోట చెప్పబడింది. ఇంకా వైద్యానికివి ఎలా వుపయోగపడతాయో వివరాలు కూడ ఇందులో తెలిసికొంటారు. ఇక మన పురాణాలలో కల్పవృక్షము (కొబ్బరిచెట్టు) ప్రస్తావన విస్తారంగా కనిపిస్తుంది.

మన ఇతిహాసాలలో వున్న ప్రాచీన వనాలే గాక ఇప్పుడు కూడ మనకు చాల ప్రసిద్ధి చెందిన వనాలు వున్నాయి. ఉదకమండలము, కలకత్తా, చండీగర్‌లలోని వృక్షశాస్త్ర సంబంధిత తోటలు, బెంగుళూరు లాల్‌బాగ్, మైసూరు బృందావనం, కాశ్మీర్, శ్రీనగర్ మొగలాయితోటలు, ఢిల్లీ రాష్ట్ర భవనంలోని అలంకారపు తోటలు, తిరుమల మీదనున్న అలంకార,

వినియోగపుతోటలు వగైరా.

ఇప్పుడు తిరుమల మీద దేవతావనాలు స్థాపింపబడుతున్నాయి. వీటిని వనదేవతలు లేదా దేవారామాలు ఇలా ఏ పేరుతో నయినా పిలుచు కోవచ్చు. దేవతావిగ్రహాలకు బదులు ఆ దేవతలు నివసించే వృక్షాలు వాటి స్థానంలో వుంటాయి. దేవాలయవాస్తు, శాస్త్ర సూత్రాలు వీటికి అన్వయిస్తాయి.

ఆ ప్రకారం వనదేవతా తోటలు ఈ క్రింది ప్రకారాలుగా నాటవచ్చు. ఆచారంలోవున్న కొన్ని తోటల స్థాపన విధానం పరిశీలిద్దాం.

పంచభూతాలలో ఒకటయిన పృథ్వి లేదా భూమి విఘ్నాధిదేవత అయిన గణపతిగా పరిగణన. అందువల్ల ఆయనకు శమీ, దూర్వపూజ ముఖ్యం. అలాగే ఉదకం లేదా నీరు భవానీదేవిగా పరిగణన. ఆమెకు అశోక, విష్ణు క్రాంతపూజ ముఖ్యం. వాయువు లేదా గాలి విష్ణుమూర్తిగా పరిగణన. ఆయనకు అశ్వత్థ, తులసీ పూజ ముఖ్యం. రోదశి లేదా ఆకాశం ఈశ్వ రునిగా పరిగణన. ఆయనకు బిల్వ, ద్రోణ పూజ ముఖ్యం. అగ్ని లేదా తేజస్సు సూర్యభగవానునిగా పరిగణన. ఆయనకు కరవీర, ఎక్కె (అర్క) పూజ ముఖ్యం. ఇలాగే అన్నీనూ.

## శివపంచాయతన వనం

శివపంచాయతన వనంలో శివుడు, అనగా బిల్వవృక్షం, మధ్యలో వుంటుంది. ఆయనకు ( బిల్వవృక్షానికి) ఆగ్నేయంగా సూర్యుడు అనగా కరవీరవృక్షం వుంటుంది. నైఋతిలో గణేశుని ప్రతీక అయిన ఖదిరవృక్షం వుంటుంది వాయువ్యంలో అంబికాదేవికి ప్రతీక అయిన అశోకవృక్షం, ఈశా న్యంలో విష్ణువు ప్రతీక అయిన అశ్వత్థ వృక్షం నాటబడివుంటాయి. ఈ విధంగా చెట్లు నాటి వాటిని పూజించడంవల్ల కలిగే అత్యున్నత ఫలితాలు పురాణ చూడామణి గ్రంథంలో వుటంకించారు.

ఈ ఐదువృక్షాలు నాటి తృప్తి పడరాదు. ఒక్కొక చెట్టుకు చుట్టూ ఆ చెట్లు ఏ దేవతకు ప్రతీకయో ఆ దేవతకు ఇష్టమయిన పూలచెట్లు చుట్టూ నాటాలి. పటం చూడగలరు. ఈ క్రింది పటంలో దేవత, వారికి ఇష్టమయిన వృక్షం, ఇష్టమయిన పూలు లేదా ఆకులు ఇవ్వబడినాయి. చూడగలరు.

| | చెట్టు నం. | చెట్టు నం. |
|---|---|---|
| ఈశ్వరుడు | బిల్వవృక్షము (13) | ద్రోణపుష్పం (25) |
| విష్ణుమూర్తి | అశ్వత్థవృక్షము (9) | తులసీపత్రం (81) |
| సూర్యభగవానుడు | కరవీరవృక్షము (41) | శ్వేతార్కపుష్పం (78) |
| గణపతి | ఖదిరవృక్షము (96) | దూర్వపుష్పం (24) |
| అంబికాదేవి | అశోకవృక్షము (83) | శంఖపుష్పం (28) |

**SHIVA PANCHAYATANA**

**శివ పంచాయతన**




## అశోకవనము

వాల్మీకి మహాకవి రామాయణ కావ్యంలో అశోకవనం వర్ణన వుంది. ఇది లంకలో రావణుడు సీతాదేవిని చెఱపుంచిన చోటు. అయినా చాల

అందమయిన తోట. ఆంజనేయుడు సీతాదేవిని యీ వనంలోనే చూశాడు. పేరుకు అశోకవనమే అయినా సీతాదేవికి యీ తోట దుఃఖాన్నే యిచ్చింది. వాల్మీకి ఈ తోటను ఎలా వర్ణించాడో చూడండి.

సాలానశోకాన్ భవ్యాంశ్చ చంపకాంశ్చ సుపుష్పితాన్,
ఉద్దాలకాన్నాగవృక్షాన్ చూతాన్ కపిముఖానపి.
తథామ్రవన సంపన్నాన్ లతాశత సమన్వితాన్,
జ్యాముక్త ఇవ నారాచః పుప్లువే వృక్షవాటికాన్.
అశోకవనికా చేయం దృఢం రమ్యా దురాత్మనః,
చందనైశ్చంపకైశ్చాపి వకులైశ్చ విభూషితా,
పున్నాగాః సప్తవర్ణాశ్చ చంపకోద్దాలకస్తథా,
వివృద్ధమూలాః బహవశ్శోభంతేస్మ సుపుష్పితాః
శాతకుంభనిభాః కేచిదగ్నిశిఖాప్రభాః.

పై వర్ణనలోని సమస్త వృక్షజాలము మాత్రమే గాక ఆ తోటలోని సెలయేర్లు, జలపాతాలు, లతా నికుంజాలు, గొడుగులా అల్లుకున్న తీగలసోయగాలు, విశ్రామస్థలాలు ఇలా అన్నిటినీ వర్ణించాడు వాల్మీకి.

భోజుని చంపూరామాయణంలో కూడ ఇలాంటి వర్ణనే వుందట. దీనిలో 38 రకాల చెట్లను రావణుడు పదిలపరిచి పోషించేవాడని చెప్పబడింది. [redacted] రామాయణంలో చెట్లను వర్ణించే చంపువు చూడండి.

నాగ - పున్నాగ - తాళ - హింతాళ - తమాల

కృతమాల - సరళ - బకుళ - వంజుల - తిలకామలక

లకుచ - కుటజ - కటక - కక్కోలంకోల - లవంగ

వికంకత - కేతకి - కదంబోదుంబర - కపిత్థాశ్వత్థ

కురుబక - మరుబక - మకంద - కుంద - తిందూక

చందన - స్యందన - చంపక - చాంపేయ - పనస

వేతస - పలాశ - పాటల - రసాలు - ప్రియాలు

వీటన్నిటికి తెలుగు పేర్లు తెలిసికోవటం చాలా [redacted] మయిన పని. సంస్కృత గ్రంథాలు తెలుగు గ్రంథాలు తరచి చూచి, నిఘంటువులు తిరుగవేసి దొరికినంతవరకు వాటిని కనిపెట్టి తిరుమల [redacted] దేవస్థానము వారు అలాంటి అశోకవనాన్ని నిర్మించటం ముదావహం. ఆ చెట్లు అందానికే కాక,

ఆయుర్వేదానికి కూడ ప్రసిద్ధి గాంచినవి. మరికొన్ని ఫలాలకు ప్రసిద్ధి. నాటిన చెట్లన్నీ పెరిగి పెద్దవయ్యాక అశోకవనమంటే ఎంత అందమయినదో తెలుస్తుంది.

### అశోకవనంలో వుండే చెట్ల జాబితా - వాటి నంబరు

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| అశోక | 8 | చంపక | 16 | కుంద | 46 | కరవీర | 41 |
| సరళ | 112 | అమలక | 2 | హింతాళ | 92 | తిలక | 119 |
| అశ్వత్థ | 9 | శింశుప | 114 | కదంబ | 36 | కపిత్థ | 40 |
| పున్నాగ | 67 | లవంగ | 101 | పాటల | 65 | ఉద్దాలక | 121 |
| అంకోల | 90 | రసాల | 108 | తమాళ | 796 | కక్కోల | 93 |
| చంపేయ | 56 | కృతమాల | 98 | ఉదుంబర | 82 | పలాశ | 63 |
| బకుళ | 85 | కటక | 74 | సాల | 110 | పనస | 104 |
| తిందుక | 120 | మకండ | 4 | లకుచ | 100 | తాళ | 118 |
| వంజుల | -- | వేతస | 123 | కురువక | 48 | వికంకత | 124 |
| మరువక | 55 | నాగకేసర | 56 | చందన | 71 | స్యందన | 117 |
| కర్ణికార | 95 | కేతకి | 43 | కుటజ | 99 | ప్రియాలు | 136 |

## సప్తర్షివనము

సప్తర్షివనము సప్త ఋషులకు ప్రతీక. వీరికి పూజచేయటం వల్ల సమస్త దుఃఖాలు సమసిపోయి సర్వశుభాలు కలుగతాయని ధర్మరాజు నుడివినట్లు పురాణాలలో వుంది. కశ్యపుడు, అత్రి, భరద్వాజ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, అరుంధతీ సమేత వశిష్టుడు వీరు సప్త ఋషులు. వీరికి కావలసిన అనగా యీ వనంలో అవసరమయిన చెట్లు, పూలు, ఆకులు చూడండి.

| | | | | |
|---|---|---|---|---|
| కశ్యప | తులసీపత్రం | 81 | అతసీపుష్పం | 10 |
| అత్రి | అగస్త్యపత్రం | 1 | కుముదపుష్పం | 45 |
| భరద్వాజ | అపామార్గపత్రం | 5 | పూగపుష్పం | 66 |
| విశ్వామిత్ర | బిల్వపత్రం | 13 | సుగంధిపుష్పం | 116 |
| గౌతమ | దత్తూరపత్రం | 20 | కుందపుష్పం | 46 |
| జమదగ్ని | దూర్వపత్రం | 24 | మాలతీపుష్పం | 51 |
| వశిష్ఠ | శమీపత్రం | 69 | తులసీపుష్పం | 81 |

# నవగ్రహవనము

| | | |
|---|---|---|
| వాయువ్యము | ఉత్తరము | ఈశాన్యము |
| కేతు | గురు | బుధ |
| పడమర | | తూర్పు |
| శని | రవి | శుక్ర |
| నైరుతి | దక్షిణము | ఆగ్నేయము |
| రాహు | మంగళ (కుజ) | చంద్ర |

పై చక్రము నవగ్రహముల అమరిక తెలుపుతుంది. నవగ్రహములు మన జీవితం మీద తమ ప్రభావాన్ని చూపుతాయన్న సంగతి అందరూ ఎఱిగినదే. అందుకే మనం నవగ్రహపూజ చేస్తాం. మనకు దురదృష్టం కలిగినప్పుడు గ్రహాలు బాగా లేవంటాము. వాటి అనుగ్రహంకొఱకై పూజచేస్తాము. నవగ్రహవనంలో వుండవలసిన చెట్ల జాబితా గ్రహాల ప్రకారం ఇవ్వబడింది.



| | | | |
|---|---|---|---|
| 1. | రవి (సూర్యుడు) | శ్వేతార్క | 78 |
| 2. | సోమ (చంద్ర) | పలాశ | 63 |
| 3. | మంగళ (కుజ) | ఖదిర | 96 |
| 4. | బుధ | ఉత్తరేణి | 5 |
| 5. | గురు | అశ్వత్థ | 9 |
| 6. | శుక్ర | అత్తి | 82 |
| 7. | శని | శమీ | [redacted] |
| 8. | రాహువు | దూర్వ | 24 |
| 9. | కేతువు | దర్భ | 91 |

# నందనవనము

ఇంద్రుని పూదోటను నందనవనము అంటారు. ఇది దేవలోకంలోని ఉద్యానవనము. ఇది కవులకు కైపు ఎక్కించిన తోట. ఏ [redacted] రచనలో నయినా నందనవన వుపమానముంటుంది. సర్వసాధారణంగా కాళిదాసు రచనల్లో మంగళాష్టకముంది. అందులో పది వృక్షాలను వుదహరిస్తూ, అవి సతత హరితాలని, పుష్పఫలభరితవృక్షాలని, వాటి వునికివల్ల ప్రపంచం సర్వకాల సర్వావస్థలలో సుభిక్షంగా వుంటుందని, అందువల్ల అవి మంగళప్రదాలని పేర్కొన్నాడు. ఈ క్రింద ఇవ్వబడినవి అన్నీ కాళిదాసు పేర్కొన్నవి కాకపోయినా దాదాపు [redacted] వర్ణనలకు సరిపోతున్నవి. కావున ఇవి నందనవనములో వుండవలసినవి.

| | | |
|---|---|---|
| 1. | అశ్వత్థ | 9 |
| 2. | వట | 86 |
| 3. | చందన | 71 |
| 4. | మందార | 53 |
| 5. | కల్పద్రుమ | – |
| 6. | జంబూ | 32 |
| 7. | నింబ | 60 |
| 8. | కదంబ | 36 |
| 9. | చూత | 18 |
| 10. | సరళ | 112 |

# నక్షత్రవనము

మన పంచాంగములో 27 నక్షత్రాలు వున్నాయి. అశ్విని నక్షత్రము నుంచి రేవతి నక్షత్రము వరకు ఇవి వున్నాయి. ఒకరు జన్మించినప్పుడు ఏ నక్షత్రంలో సూర్యుడు వుంటాడో ఆ పుట్టిన వ్యక్తిది ఆ నక్షత్రమే అవుతుంది. ఈ జన్మనక్షత్రాల ప్రభావం మనజీవితం మీద ఎక్కువగా వుంటుంది. కానీ [redacted] తోట వేయుటం అంత సులభమేమీ కాదు. వృత్తాకారంలో డిగ్రీలు కొలిచి జాగ్రత్తగా వేస్తేగానీ సరిగా రాదు.

మంత్ర మహార్ణవముతో బాటు అనేక శాస్త్రాలు యీ నక్షత్రాల స్వభావాన్ని గూర్చి తెలియజేస్తున్నాయి. ఈ నక్షత్ర స్వభావాన్ని బట్టి చెట్ల ఎంపిక కూడ జరిగింది. ఇందులో సూర్యోదయం సమయపు నక్షత్రాలు వేరు. సూర్యాస్తమయ నక్షత్రాలు వేరు. అలాగే వాటికి సంబంధించిన వృక్షజాతికూడ.



## సూర్యోదయ సమయము

| | | | |
|---|---|---|---|
| 1. | జేష్ఠ | సరళవృక్షము | 112 |
| 2. | అనూరాధ | [redacted] (వకుళ) | 85 |
| 3. | విశాఖ | వికంకట | 124 |
| 4. | స్వాతి | అర్జున | 6 |
| 5. | చిత్త | బిల్వ | 13 |
| 6. | హస్త | అంబష్ఠ | 89 |
| 7. | ఉత్తరఫల్గుణి | ప్లక్ష (జువ్వి) | 105 |
| 8. | పూర్వఫల్గుని | పలాశ | 63 |
| 9. | మఖ | రోహిణి | 109 |
| 10. | ఆశ్లేష | నాగ | 56 |
| 11. | పుష్యమి | పిప్పల (అశ్వత్థ) | 9 |
| 12. | పునర్వసు | వంశీ (వెదురు) | 112 |
| 13 | ఆర్ద్ర | కృష్ణ | 97 |
| 14. | మృగశిర | ఖదిర | [redacted] |

## సూర్యాస్తమయ సమయము

| | | | |
|---|---|---|---|
| 15. | రోహిణి | జంబూ (నేరేడు) | 32 |
| 16. | కృత్తిక | ఉదుంబర (అత్తి) | 82 |
| 17. | భరణి | ధాత్రి | 23 |
| 18. | అశ్విని | కరస్కర | 94 |
| 19. | రేవతి | మధుక (విప్ప) | 102 |
| 20. | ఉత్తరాభాద్ర | ఆమ్ర (మామిడి) | 4 |
| 21. | పూర్వాభాద్ర | నింబ (వేప) | [redacted] |
| 22. | శతభిషం | కదంబ | 36 |
| 23. | ధనిష్ఠ | శమీ | 69 |
| 24. | శ్రవణ | అర్క | 7 |
| 25. | ఉత్తరాషాడ | పనస | 104 |
| 26. | పూర్వాషాడ | వంజుల | – |
| 27. | మూల | సర్జ | 113 |

పగలు రాత్రి సమానంగా వున్న రోజులను విషవత్తులు అంటారు. ఇవి సంవత్సరములో రెండు రోజులు మాత్రమే. జూన్ 21 వ తారీఖు,

డిసెంబరు 22వ తారీఖు. ఈ రెండు రోజులలో సూర్యోదయము ఎన్ని డిగ్రీలలో అవుతుందో ఆ తొలి కిరణాలు దానికి సంబంధించిన వృక్షాలమీదనే పడేటట్టుగా వుండాలి. ఉదాహరణకు డిసెంబరు 22 తారీఖున తోటలోనికి వచ్చి సూర్యోదయం చూస్తే ఆ కిరణాలు, సరళవృక్షాలమీద పడాలి. సరళవృక్షాలు జేష్ఠా నక్షత్రానికి చెందినవి.

## రాశి వనము

మన పంచాంగములో 12 రాశులు వున్నాయి. మన జన్మ నక్షత్రాన్ని అనుసరించి మన జీవనము వున్నట్టే మనము జన్మించిన రాశిని బట్టికూడ మన అదృష్టం వుంటుంది. వరాహమిహిరుని జ్యోతిషశాస్త్రములో యీ వివరాలు వున్నాయి. రాశి ఏమిటో, ఆ రాశ్యాధిపతి ఎవరో, దానివల్ల కలిగే ఫలితాలు ఏమిటో ఆయన వ్రాశారు. [illegible] రాశులకు అనువయిన వృక్షాలు నాటడమే రాశివనము.

| రాశి | | రాశ్యాధిపతి | వృక్షము | చెట్టు నం. |
|---|---|---|---|---|
| 1. | మేష | కుజుడు | రక్తచందనము | 107 |
| 2. | వృషభ | శుక్ర | సప్తపావని (మద్ది) | 111 |
| 3. | మిథున | బుధ | పనస | 104 |
| 4. | కర్కాటక | చంద్ర | పలాశ | 63 |
| 5. | సింహ | రవి | బదరి | 103 |
| 6. | కన్యా | బుధ | ఆమ్ర (మామిడి) | 4 |
| 7. | తులా | శుక్ర | బకుళ | [illegible] |
| 8. | వృశ్చిక | కుజ | [illegible] (ఖైర్) | 96 |
| 9. | ధనస్సు | గురు | అశ్వత్థ | 9 |
| 10. | మకర | శని | శింశుప | 114 |
| 12. | కుంభ | శని | శమీ | 69 |
| 13. | మీన | గురు | వట | 86 |

నక్షత్ర వనములాగానే రాశివనం కూడ సూర్యసంచారాన్ని అనుసరించి నిర్మింపబడుతుంది. అయితే ఇది చతురస్ర ఆకారంలో వుంటుంది. సూర్యగమనాన్ని అనుసరించి సూర్యకిరణాలు ఎప్పుడు ఏ చెట్టుమీద ఏ వృక్షం మీద పడి, దాని నీడ ఎలా ప్రాకాలో నిర్ణయించుకొని తోట నాటాలి. రాశి చక్రపద్ధతి చూడండి.

| | | | |
|---|---|---|---|
| మీనం | మేషం | వృషభం | మిధునం |
| కుంభం | | | కర్కాటం |
| మకరం | | | సింహం |
| ధను | వృశ్చికము | తుల | కన్య |

# తులసీవనం

ఇందులో అన్నీ తులసి చెట్లు మాత్రముంటాయి. తులసిలో లక్ష్మీ తులసి, విష్ణుతులసి అని రెండు రకాలు. తులసి కాండము ఆకులు తెల్లవిగా వుంటే అది లక్ష్మీతులసి, నల్లగా వుంటే అది విష్ణుతులసి. తులసి విష్ణుమూర్తికి ప్రీతి పాత్రమయినది. మంచి మందుగా వుపయోగపడుతుంది. వివరాలు మరోచోట చదువవచ్చు. ప్రతి ఇంటి పెరటిలో వెనుకవైపు ద్వారానికి అభిముఖంగా తులసీకుండము కట్టి అందులో పెరిగిన తులసిని పూజిస్తూవుంటారు. ఇది శుభావహం.

# సంతానవనము

(రచ్చబండ)

సంతానము లేనివారు రచ్చబండ చుట్టూ తిరుగుతూంటారు. రచ్చ బండ అనేది ప్రతి గ్రామములో మునుపు ఉండేది. ఇప్పుడు కూడ ఎక్కువ గ్రామాలలో వుంది. రావిచెట్టు, వేపచెట్టు సమవయస్సులో నుండగా రెండింటిని ఒకచోట నాటి, వాటికి వివాహం చేసి, వాటి చుట్టూ రచ్చబండ కట్టేవారు. వాటిక్రింద నాగబంధం అనగా రెండు పాములు మెలివేసుకో వటం ప్రతిమను ప్రతిష్ఠించితే దానినే 'నాగలు' అని కానీ 'నాగబింబం' అను పేరుతో కానీ పిలుస్తారు. తడిబట్టలతో వీటిని చుట్టడంవల్ల సంతాన యోగకారకమయిన వీర్యాభివృద్ధి కలుగుతుంది. రావి, వేపల గాలిసోకడంవల్ల అది ఉధృతమయి సంతానయోగం కలుగుతుంది. అందువల్ల దీనిని సంతాన వనము అని పిలుస్తారు. ఈ వనంలో గమనించతగినది వేపచెట్టుకు వయసు కొద్దిగా ఎక్కువగా వున్నా ఫరవాలేదు నాటవచ్చును.

# తెలుసుకోదగ్గ విశేషాలు - 1

చెట్లు, మొక్కలు, పూలు వీటిని గురించి తెలుసుకొనేటప్పుడు యీ క్రింద వాటిని గూర్చి తెలుసుకోవటం చాలా ముఖ్యం.

అష్టధూపద్రవ్యములు గుగ్గిలము, నేపాకు, వస, చెంగల్వ కోష్ఠు, కర క్కాయ, ఆవాలు, యవలు, నేయి.

**అష్టబిల్వములు** పంచబిల్వములు, 6. శమి (జమ్మి), 7. అమలక (నెల్లి), 8. దూర్వ (గఱిక)

**అష్టమూలములు** అడ్డసరము, గగ్గెర, తిప్పతీగె, తులసి, పర్యాటకము, చేదుపొట్ల, విష్ణుక్రాంతము, చిట్టాముట్టి.

**అష్టయజ్ఞద్రవ్యములు** రావి, మేడి, జువ్వి, మఱ్ఱి, (వీని సమిధలు), నువ్వులు, ఆవాలు, పరమాన్నము, నేయి.

**అష్టవర్షపర్వతములు** హిమాచలము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగి, మాల్యవంతము, గంధమాదనము.

**అష్టాదశధాన్యములు** యవలు, గోధమలు, వరి, నువ్వులు, కొఱ్ఱలు, ఉలవలు, మినుములు, పెసలు, చిఱుసెనగలు, అనుములు, చామలు, ఆవాలు, గవేధుకములు, నివ్వరిధాన్యము, కందులు, సలే నకములు, సెనగలు, చీనీధాన్యము.

**అమ్లపంచకము** 1. రేగు, దానిమ్మ, చింత, పులిచింత, పుల్లప్రబ్బలి, 2. నిమ్మ, నారింజ, పుల్ల ప్రబ్బలి, చింత, మాదీఫలము.

**ఏకవింశతి పత్రములు** గణేశవ్రతములో వున్న 21 పత్రములు.

**కంటకారీత్రయము** (ఆయుర్వేదము) వాకుడు, రేవటిదూలకోవిల, నెల్లిచెట్టు.

**కంటచాతుర్జాతకము** (ఆయుర్వేదము) ఏలకులు, ఆకుపత్రి, దాల్చిన చెక్క, మిరియాలు.

**కిరాతాదిచతురణము** (ఆయుర్వేదము) నేలవేము, తిప్పతీగ, తుంగముస్తె, శొంఠి.

**గంధాష్టకములు** జాపత్రి, లవంగములు, దాల్చినచెక్క, ఏలకులు, నాగకేసరములు, మిరియములు, కస్తూరి, ఆకుపత్రి.

**గరమాపంచకము** (ఆయుర్వేదము) రేలపండు, తుంగముస్తెలు, కరక్కాయ, కటుకరోహిణి, పిప్పలిమూలము.

**గిరిమూలపంచకము** (ఆయుర్వేదము) రేల, గ్రంధి పత్ర, తుంగముస్తలు, చేదుపొట్ల, కరక్కాయ.

**గురుపంచమూలములు** మారేడువేరు, దుందిలపువేరు, గుమ్ముడువేరు, కలిగొట్టువేరు, కూరనెల్లివేరు.

**చతురామ్లములు** (ఆయుర్వేదము) అమ్లవేతసము, వృక్షామ్లము,

నిమ్మ, గజనిమ్మ.

| | |
|---|---|
| చతురూషణములు | శొంఠి, పిప్పలి, మిరియాలు, పిప్పలిమూలము. |
| చతుర్జాతకములు | ఏలకులు, లవంగచెక్క, లవంగపత్రి, నాగకేసరము. |
| చాతుర్భద్రకములు | శొంఠి, అతివస, తుంగముస్తలు, తిప్పతీగె, నేలవేము, శొంఠి, తుంగముస్తలు, తిప్పతీగె. |
| చిత్రమూలత్రయము | నల్ల, తెల్ల, ఎఱ్ఱ చిత్రమూలములు. |
| జీరకద్వయము | జీలకఱ్ఱ, నల్లజీలకఱ్ఱ. |
| జీవనపంచమూలములు | పిల్లపీచర, పెద్దగుమ్మడి, పాలకూర, జీవకము, వృషభకము. |
| తిక్తపంచకము | బిల్వము, చేదుపొట్ల, మలక, తిప్పతీగ, అడ్డసరము. |
| తృణపంచమూలములు | వరి, దర్భ, జనపదంటు, చెఱకు, కారంచిగడ్డి. |
| త్రికటుకములు | (త్రియూషములు) శొంఠి, పిప్పలి, మిరియాలు. |
| త్రిగంధములు | ఏలకులు, జాపత్రి, దాల్చినచెక్క. |
| త్రిజాతములు | ఏలకులు, లవంగచెక్క, లవంగ పత్రి. |
| త్రిపత్రములు | లవంగపత్రి, జాజిపత్రి, తాలిపత్రి. |
| త్రిపుణములు | తాళకము, పల్లేరు, బటానీలు. |
| త్రిఫలములు | 1. కరక, తాడి, ఉసిరికలు; 2. ద్రాక్ష, కాశ్మర్య, ఖర్జూరములు; 3. జాజి, లవంగ, పూగఫలములు. |
| త్రిసమములు | కరక, శొంఠి, తిప్పతీగె. |
| త్వక్పంచకము | మఱ్ఱి, మేడి, రావి, జువ్వి, ప్రబ్బ చెట్ల బెరడు. |
| దశకషాయమూలము | నల్లఉప్పి, తెల్లఉప్పి, కొలాకు, పున్న, ముయ్యాకుపున్న, చిత్రమూలము, సీతాఫలము, చేదుపొట్ల, వావిల, వరగోకి, నేలఉసిరిక. |
| దశక్షారములు | మునగ, ముల్లంగిదుంప, మోదుగ, చింత, అల్లము, చిత్రమూలము, వేప, గుమ్ముడు, ఉత్తరేణి, వాకుడు. |
| దశమూలములు | చిన్నములక, పెద్దములక, నక్కతోక, పొన్న, ముయ్యాకుపొన్న, పల్లేరు, మారేడు, కూరనెల్లి, గుమ్ముడు, దుందిలము, కలిగొట్టు. |
| దివ్యవనములు | మేరువునకు ఉత్తరమున నందనము, తూర్పున చైత్రరథము, దక్షిణమున గంధమాదనము, పశ్చిమమున వైభ్రాజనమును కలవు. |

దీపకపంచకము కసివెంద, చిత్రమూలము, వాయము, అజామోదము, జీలకర్ర.
దీవ్యకషట్కము కుంకుమపూవు, గ్రంథితగరము, చిత్రమూలము, జీలకర్ర, నిమ్మ, మయూరశిఖ.
దూర్వాద్రయము నల్లసుగంధి, నీలిచెట్టు, కోయిలదింతెన.
దేవతరువులు మందారము, కల్పవృక్షము, పారిజాతము సంతానము, హరిచందనము.
నవధాన్యములు వడ్లు, ఉలవలు, పెసలు, మినుములు, నువ్వులు, గోధుమలు, అనుములు, కందులు, సెనగలు.
అరణ్యములు సైంధవ, దండక, నైమిశ, కురు, జాంగల, ఉత్పత్తావృత, జంబూమార్గ, పుష్కర, హిమాలయ పర్వతారణ్యములు.
పంచకషాయము వస, మాంసరోహిణి, చేదుపొట్ల, ప్రియంగు, నింబ వీనిని కషాయముగా చేయుట.
పంచకూల కషాయము పిప్పళ్లు, పిప్పలిదుబ్బులు, శేవ్యము, చిత్కారము, శొంఠి వీని కషాయము.
పంచకోలములు శొంఠి, చవ్యము, మోడి, పిప్పళ్లు, చిత్రమూలము.
పంచక్షారములు యవ, మోదుగ, గంటె, నువ్వు, మొక్కపు చెట్టు.
పంచక్షీరవృక్షములు మఱ్ఱి, రావి, జువ్వి, మేడి, గంగరావి.
పంచగణము నేలమునగ, పల్లేరు, వాకుడు, కోలాకుపొన్న, ముయ్యాకుపొన్న.
పంచతిక్తములు వేప, తిప్పతీగ, అడ్డసరము, చేదుపొట్ల, వాకుడు.
పంచత్వక్కులు రావి, మఱ్ఱి, జువ్వి, మేడి, మామిడి, వీని పట్టలు.
పంచనింబలు వేపబెరడు, వేపాకు, వేపపూవు, వేపకాయ, వేపపైపట్ట.
పంచపల్లవములు అశ్వత్థ, ఉదుంబర, వట, చూత ప్లక్షములు, పుణ్యాహ వాచన వ్రతాదులందు కలశాలలో నుంచదగినవి.
పంచబదరీనారాయణములు బదరి, ఆదిబదరి, యోగబదరి, వృద్ధబదరి, భవిష్యద్బదరీనారాయణములు.
పంచబలములు బల, అతిబల, నాగబల, రాజబల, మహాబల ఇవి వృక్షములు. వీనినే పంచబలమూలములు, బలా పంచబలమూలములు అంటారు.

**పంచబీజములు** పెద్దదోస, చిన్నదోస, దాడిమ, తామర, దూలగొండి విత్తనములు, మతాంతరమున ఆవాలు, అజామోదము, జీలకఱ్ఱ, నువ్వులు, గసగసాలు.

**పంచభద్రములు** తిప్పతీగ, పర్పాటకము, తుంగదుంప, నేలవేము, శొంఠి.

**పంచభృంగములు** దావరుడంగి, వావిలి, జమ్మి, గంజాయి, తాలిసపత్రి.

**పంచవటములు** మారేడు, రావి, మఱ్ఱి, అశోకము, మేడి.

**పంచవల్కలములు** మఱ్ఱి, జువ్వి, రావి, కెడి, అమ్లవేతసము.

**పంచసరోవరములు** బిందు, పంపా, మానస, పుష్కర, నారాయణ సరస్సులు.

**పంచసస్యములు** వరిధాన్యము, నువ్వులు, పెసలు, యవలు, తల్లాపలు.

**పంచగ్రామములు** ద్రాక్షారామము, భీమారామము, సర్పారామము, అమరారామము, కోమరామము.

**పాకత్రయము** నారికేళము, కదళి, ద్రాక్ష.

**పిప్పలీద్వయము** పిప్పలి, గజపిప్పలి.

**పునర్నవాత్రయము** గలిజేరు, గుంటగలిజేరు, ఎఱ్ఱగలిజేరు.

**బిల్వపంచకము** తులసి, మారేడు, వావిలి, ఉత్తరేణి, వెలగపత్రులు.

**బిల్వాష్టకము** పైవాటిలో జమ్మి, గరిక, ఉసిరిక పత్రులు కలిసినచాలును.

**మన్మథ బాణపంచకము** అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము.

**మన్మథుని వింటినారులు** 1. తుమ్మెదయల్లె -- దీని బాణములు -- కలువ, తామర, మల్లెపూలు.

2. చిగురుటల్లె – దీని బాణములు – నల్లకలువ, అరటి, మొల్లపూలు.

3. తూడునూలునారి -- దీని బాణములు -- మంకెన అశోక, మల్లెపూలు.

4. కురువేరుదంటనారి – దీని బాణములు -- పాదిరి, పొగడ, సంపంగిపూలు.

5. వెన్నెలనారి – దీని బాణములు -- మొదలిజొన్న, దిరిసెనము, మొగలిపూలు.

**మరీచికాద్వయము** మిరియాలు, తెల్లమిరియాలు.

**లఘుపంచమూలములు** చిన్నములక, పెద్దములక, కోలపొన్న. నేలపొన్న, పల్లేరు వేర్లు.

**వర్షపర్వతములు** హిమాచలము, హేమకూటము, నిషధము, నీలము, శ్వేతము, శృంగి, మాల్యవంతము, గంధమాదనము.

**శతావరిపంచమూలములు** పిల్లపెసర, పెసర, గలిజేరు, ముత్తనపులగము, ఆముదపుచెట్టు.

**హిమత్రయము** శ్వేతచందనము, హరిచందనము, రక్తచందనము.

**హ్రస్వపంచమూలములు** నేలమునగ, వాకుడు. పృశ్నిపర్ణి, శాలిపర్ణి, పల్లేరు వేర్లు.



# తెలుసుకోదగ్గ విశేషాలు - 2

**ఉగాదిపచ్చడి :** తెలుగు సంవత్సరాది ఉగాదినాడు మనం తయారుచేసే ఉగాది పచ్చడి మనం జీవితంలో అనుభవించే సుఖ దుఃఖాలకు సంకేతం. ఇందులో ఆరు రసాలు వుంటాయి–తీపు, పులుపు, ఉప్ప, కారము, చేదు, వగరు. ఆయుర్వేదంలో ఈ ఆరురసాలు (షడ్రస అభ్యాసం) తీసికోవడం ఎంతో ఆరోగ్యకరమని చెప్పబడింది. బెల్లం మనస్సును ఆహ్లాదపరుస్తుంది. చింతపండు జీర్ణశక్తిని వృద్ధి పరుస్తుంది. ఉప్ప రుచి కలిగిస్తుంది. వాము కార శక్తితో ఆకలి కలిగిస్తుంది. వేప తిక్తరసంతో క్రిములను నాశనం చేయడమే కాకుండా రక్తశుద్ధి చేస్తుంది. వగరు కలిగిన మామిడి పిందెలు కషాయగుణం కలిగి ఆరోగ్యాన్ని పరిరక్షిస్తాయి.

**షడంగపానీయము :** తుంగముస్తలు, ఏర్వాటకము, ఉషీర (వట్టి వేరు), చందనము, సుగంధిపాల, శొంఠి – ఈ ఆరిటితో తయారుచేసిన షడంగ పానీయం శరీరంలోని కల్మషాలు సులభంగా విసర్జింపబడటానికి తోడ్పడుతుంది. అంతేగాక దీనిలో అన్ని విటమినులు వుంటాయి. మెద డుకు శరీరానికి చల్లదనం కలుగుతుంది. కడుపులోని ఆమ్లగుణం తగ్గుతుంది. సులభ జీర్ణకారి.

గోధుమజావ, బియ్యపు గంజి, కొబ్బరి నీరు, ఇక్షురసం (చెరకుపాలు) ఇలాంటివన్నీ శరీరానికి మంచిగుణాలు కలిగిస్తాయి.

**వంట సాధకాలు :** మనం వంటలలో వాడే మెంతులు, లవంగాలు, ఆవాలు, దాల్చినచెక్క, ఏలకులు, జీలకర, మిరియాలు, కరివేపాకు, దని యాలు, సోంపు, గసగసాలు, ఎల్లిగడ్డలు, తెల్లగడ్డలు -- ఇవన్నీ గొప్ప ఔషధ గుణములు కలిగినవి. అందువలననే అవి మన నిత్యావాడకంలో భాగాలయి నాయి. వీటిని గురించి అందరూ ఎఱుగుదురు.

# హిందూమత సాంప్రదాయాలు - వాటి విశిష్టత

1. ఆవుపంచితము ఇంటిలోను, పరిసరాలలో చల్లుట గోమూత్రము యొక్క అంటురోగ నిరోధకత్వం తెలుపుతుంది.
2. గోమయము (Cow dung) : ఆవు పేడతో ఇల్లు అలకడములో గో

మయము యొక్క క్రిమినాశక శక్తి గోచరిస్తుంది.

3. పసుపు : గుమ్మపు వాకిళ్ళకు, ద్వారబంధాలకు పసుపు రాయడములో పసుపు యొక్క అంటురోగ నివారణశక్తి అర్థమౌతుంది.
4. స్త్రీలు స్నానమునకు పూర్వము మరియు బహిష్టు అనంతరము రాచు కొనడములో పసుపుయొక్క రోగనిరోధకశక్తిని గమనించవచ్చు.
5. మామిడి తోరణములు : ముఖ్యంగా పండుగ వేళలలో పందిళ్ళకు తోరణములుగ కట్టెదరు. ఇవి అందము కొరకేగాక ఆరోగ్యంకోసం కూడ అవసరం. పచ్చటి ఆకులలోని సతతహరితము గృహములో ప్రాణవాయువునధికము చేయును.
6. వేపమండలు : మంత్రోచ్చారణార్థము వాడుటలో వాటి Anti-viral effect (భూతఘ్న గుణము) గమనించవచ్చు.
7. వెల్లవేయడం : గోడలకు, ఇళ్ళకు తెల్లసున్నమును కొట్టడంలో, సున్నము యొక్క సూక్ష్మజీవుల నాశకశక్తి వెల్లడౌతుంది.
8. ఎర్రమట్టి : దీనిని జాజు అని అందురు. దీనిని ఇంటిగోడ అంచు లకు రాయడంలో ఎఱుపు, కాషాయం త్యాగగుణాలకు చిహ్నమని గమనించవచ్చు.

## దివ్య ఔషధ ధారణ

సువాసనగల గంధములు, పుష్పమాలికలు, రత్నములు, ఆభరణములు, జపమాలలు ధరించిన యెడల వీర్యవృద్ధి, ఆయుర్వృద్ధి, శరీరమునకు బలము, పుష్టి, మనస్సునకు సంతోషము కలిగించును. అలక్ష్మిని తొలగించును. ఈ క్రింది మాలలు - ఉపయోగాలు చూడవచ్చు.

ఉదా:రుద్రాక్ష ధారణ -- శాంతము, తేజము లభ్యం.
తులసీమాల ధారణ – భక్తి, వినమ్రత లభ్యం.
కమలబీజ ధారణ – పవిత్రత లభ్యం.
మణి ధారణ – శరీరఉష్ణం క్రమబద్ధం.

భూత ప్రేత పిశాచాది బాధలు గ్రహబాధలనుండి తప్పించుకొనుట కొరకే ఇంటిలో తులసిచెట్టును పెంచెదరని కొందరిమతము. క్రిమికీటకా దులు, సర్పాలు ఈ తులసీవనం దరికి రావు.

నవగ్రహముల శాంతికొరకు నవరత్నములు పొదిగిన నగను ధరించుట

హితము. నవగ్రహ శాంతి కొరకు ఈ క్రింది విధముగ మణివిశేషములను ధరింపవలెను.

| | |
|---|---|
| సూర్యునకు | పద్మరాగము |
| చంద్రుడు | ముత్యము |
| అంగారకుడు | పగడము |
| బుధుడు | మరకతము |
| గురుడు | పుష్పరాగము |
| శుక్రుడు | వజ్రము |
| శని | నీలము |
| రాహువు | గోమేధికము |
| కేతువు. | వైఢూర్యము |

ఋతువును అనుసరించి ధరించవలసిన పుష్పములు.

| **ఋతువు** | **పుష్పములు** |
|---|---|
| 1. హేమంత ఋతువు | శతపత్రి (పద్మం), కలువ |
| 2. శిశిరము | సంపంగి, పొగడ |
| 3. వసంతము | మొగలి, కుటజము |
| 4. గ్రీష్మము | మల్లి, జాజి |
| 5. వర్ష ఋతువు | గులాబి, గోరింట, |
| 6. శరదృతువు | గన్నేరు, మరువం |
| | పాటలీపుష్పం (కలిగొట్టు) |

## ఆకుకూరలు — ప్రాధాన్యత

తాజా ఆకుకూరలు తినటంవల్ల కొన్ని ముఖ్యమయిన విటమినులు, ఖనిజలవణాలు శరీరపోషణకు లభ్యమవడమే కాకుండా మలబద్ధకం పోగొడతాయి. ఇది పేదవారికి సులభంగా లభ్యమయ్యే దివ్యౌషధం. ఈ క్రింది ఆకుకూరలు వాడటం అతి ముఖ్యం.

తోటకూర
పొన్నగంటి ఆకు
చుక్కాకు
చిర్రాకు

మునగాకు
బచ్చలాకు
మెంతాకు
అవిశాకు
పాలకూర మొదలగునవి.

## తాంబూల సేవన
### (చరకసంహిత)

భోజనముచేసిన వెంటనే వృద్ధిబొందిన కఫమును శమింపజేయుటకొరకై కటు (కారం), తిక్త (చేదు), కషాయ (వగరు) రసయుక్తమైన పోకలు, చలువమిరియాలు, పచ్చకర్పూరము, లవంగములు, జాజికాయ అనువానిని గాని, ఇతర ద్రవ్యములుగాని తమలపాకులతో చేర్చి మంచి పరిమళముతో కూడిన తాంబూలమును సేవింపవలెను.

సాధారణంగా తమలపాకులలో క్రిందివి చేర్చెదరు. ఒక వక్క, 5 ఆకులు, నిష్ఠావ ప్రమాణము ($1\frac{1}{2}$grain) సున్నము, అందులో సగము పచ్చ కర్పూరము, తక్కోలాలు, లవంగాలు, జాజికాయ ఇవి కలిపి తిన్నచో సర్వ దోషములను హరించును.

**తాంబూల సేవనకు యుక్త సమయములు :**

1. నిద్రనుండి లేచినపుడు
2. స్నానానంతరం
3. వాంతి అయిన తరువాత
4. ప్రభాత సమయమున
5. భోజనానంతరం
6. రతికాలమందు
7. ప్రయాణ సమయమున
8. యుద్ధ సమయమున
9. సభా సమయమున
10. వివాహ సమయమున
11. యజ్ఞ హోమ దేవకార్యములందు, గ్రామ ప్రతిష్ఠా సమయములందు తాంబూల సేవన చేయవలెను.

**లాభములు :**

1. త్రిదోషశమనము.

2. అగ్నిదీప్తి (ఆకలి కలిగించును).
3. కాంతి.
4. ముఖవైశద్యం (నోటి ప్రక్షాళన) సుగంధం.
5. మనస్సును వికసింపచేయును.
6. సంభోగ శక్తిని కలిగించును.
7. స్రోతోశ్శుద్ధి (ఆహారనాళము శుద్ధి).
8. నోరు దంతములు నాసిక, కంఠము, నేత్ర సంబంధ వ్యాధులు రాకుండ నివారించును.
9. ముఖ ప్రసేకము (నోటిలోజిడ్డు)ను పోగొట్టును. దుర్వ్యసనను తొలగించును.
10. దవడలయొక్క, దంతములయొక్క మలినమును పోగొట్టి వాటికి బలమును చేకూర్చును.
11. స్వరమునకు మంచిది.
12. శ్లేష్మరోగహరం.

గమనిక : తొలిసారినోట వచ్చిన తాంబూల రసమును మ్రింగరాదు (విషతుల్యము). మలిసారి రసము విరేచనకారి. తర్వాత కలుగు రసము అమృతతుల్యము, చక్కగ జీర్ణము చేయును. రసాయనము.

## దంతధావనము

దంతధావనార్థము ఉపయోగించు కాష్టము (పుల్ల) యొక్క ఒక చివరను బాగ నలియగొట్టిగాని నమిలిగాని మెత్తగ, మృదువుగ వుండునట్లు కుంచె వలె చేసికొనవలెను. ఇందుకొరకై ఉపయోగించు పుడక కటు (కారము), తిక్త (చేదు), కషాయ (వగరు) రస ప్రధానమై యుండవలెను. దాదాపు 12 అంగుళముల నిడివి కలిగి, చిటికిన వ్రేలంత మందముగ, మృదువుగ, వంకరలు లేక యుండవలెను. దంతధావన సమయమున పూర్వాభిముఖుడై, ఉత్తరాభిముఖుడై గాని, మౌనముగ, నిశ్చలముగ కూర్చొనవలెను.

దంత ధావనార్థము ఉపయోగించు కాష్టములు:

1. కరంజ (కానుగ)
2. కరవీరవేరు (గన్నేరు) వేరు
3. అర్క (జిల్లేడు వేరు)
4. ఖదిర (సండ్ర)

5. వట (మఱ్ఱి)
6. నింబ (వేప)
7. మధూక (విప్ప).

విశిష్ట దంతకాష్ఠములు

1. బబ్బూల (తుమ్మ)
2. పలాశ (మోదుగ)
3. విభీతకీ (తాండ్ర)
4. శాల్మలీ (బూరుగ)
5. కోవిదార
6. పారిబద్ర
7. నిర్గుండి (వావిలి)
8. శిగ్రు (మునగ)

తిక్త (చేదు) రస ప్రధానములలో వేప, కషాయ, వగరు రస ప్రధానములలో నండ్ర, కటురస (కారం) ప్రధానములలో కానుగ, మధుర రస ప్రధానములలో విప్ప దంత ధావనమునకు శ్రేష్ఠమైనవి.

దంత ధావనము నోటియందలి దుర్గంధమును వైరస్యమును పోగొట్టును. నాలుక, దంతములు, నోరు వీని యందలి దుర్గంధమును తొలగించి రుచిని కలిగించును.

# మొక్కలు
# మోక్షమునకు మార్గము

భగవంతుని సృష్టిలోని మొక్కలు, వృక్షాలు, పుష్పాలు ఎక్కువ భాగం ఆయన సేవకే సృష్టింపబడినాయి. [redacted] వన సంపదను ఉపయోగించి ఆయనకు పూజ చేయవచ్చు. వ్రతాలు ఆచరించ వచ్చు. వనాలు పెంచవచ్చు. ఏ పని చేయాలన్నా, [redacted] మొక్కలు ఏమిటో, [redacted] పుష్పాలు ఏమిటో, ఆ పవిత్ర వృక్షాలు ఏమిటో, వాటి వుపయోగమేమిటో తెలిసికోవాలి. అందువల్ల మొదట వాటిని గురించి తెలిసికొందాం.



1. అగస్త్య — అవిశ

Sesbania glandiflora,
Papillioneceae.

అవిసె ఆకు పిత్తాన్ని కఫాన్ని తగ్గిస్తుంది. దీని కాయలు మంచి సత్తువ, [redacted] కలిగిస్తాయి. ఆకులు, పూలు, కాయలు పులుసులు, వేయింపులు చేసికొని తింటారు. పూల రసం కళ్లలో పిండితే చూపు స్పష్టంగా కనిపిస్తుంది. [redacted] పండిన కాయలు ఒంటి చెంప నొప్పికి, ట్యూమర్లకు (గడ్డలకు) వైద్యానికి పనికి వస్తాయి. వ్యవసాయదారులు దేశమంతా దీనిని పండిస్తారు. అవిసె చెట్లు అందరికీ ఆహారం. పశువులకు ప్రత్యేక దాణా.

Amal[redacted]



## 2. ఆమలకం – ధాత్రి

నెల్లికాయ, ఉసిరిక

Emblica officinalis,
Euphorbiaceae

నెల్లికాయల కొమ్మతో బాటు తులసికి పూజ చేస్తారు. ఎండినకాయలు వాడి, రక్తస్రావాన్ని, బేదులను, నెత్తురు బేదులను తగ్గిస్తారు. నెల్లికాయ రసం తేనెలో కలిపి త్రాగితే మంచి శక్తిదాయిని. ఈ షర్బత్ ఇంకా అనేక విధాల మేలు చేస్తుంది. చ్యవన ప్రాశ అనే లేహ్యంలో దీనిని [redacted] ఉపయోగిస్తారు. దీని వూరగాయ రుచి అందరికీ తెలిసిందే. ఉసిరి [redacted] లలో 'సి' విటమిను సమృద్ధిగా వున్నది. [redacted] తీర్థంలో ప్రతి సంవత్సరం నెల్లి చెట్టుకు పూజ చేస్తారు. కార్తీక మాసంలో వనభోజనం ఈ చెట్టుక్రింద చేస్తారు.



## 3. ఆమ్ల

**చింతకాయ** — **Tamarindus indica, Leguminaceae, Caesalpinac.**

ఈ చెట్టును భారత దేశములోని అన్ని ప్రాంతాలలోను పెంచెదరు. ఒకటి, రెండు సంవత్సరాలు నిలువ చేసిన చింతపండు కడుపు, కాలేయం, చిన్నప్రేవులు శుద్ధి కావడానికి ఉపయోగపడుతుంది. అందుకే వంటలలో వాడతారు. చింతపూల రసం త్రాగితే మొలల రక్తస్రావం తగ్గుతుంది. శ్రీ వేంకటేశ్వరస్వామి స్వయంభువు విగ్రహం ఒక చింత చెట్టుక్రింద పుట్టలో దొరికిందని గ్రంథాలలో వ్రాయుబడివుంది.

Amra
Makanda



4. ఆమ్ర – మకంద

మామిడి, చూత

Mangifera indica.
Anacardiaceae.

18వ నంబరు చూడుము.

**Apamarga**
**Uttarani**



# 5. అపమార – ఉత్తరేణి

**ఉత్తరేణి**

Achyranthus aspera,
Amarantaceae

ఇంద్రుడు వృత్రాసురుని చంపిన తరువాత నముచి అనే రాక్షసుని చంపడానికి అతనితో కపటస్నేహం చేస్తాడు. నముచి విశ్రాంతి తీసి కొంటూవుండగా ఇంద్రుడు అతని తలను ఫేనముతో నరికివేస్తాడు. ఆ తెగిన తల 'మిత్రద్రోహీ!' అని అరుస్తూ ఇంద్రుని తరుముకొంటుంది. దానితో తారెత్తిన ఇంద్రుడు బృహస్పతిని సంప్రదించి ఒక యాగముచేసి నముచి తలబారినుంచి తప్పించుకొంటాడు.

ఆ యాగమే రాజసూయయాగంలోని ఒక భాగం. అందులో ఉత్తరేణి ధాన్యం వాడారు. ఈ ధాన్యం వాడి యాగం చేసిన ఇంద్రుడు, నాముచికి [redacted] [redacted] అలా అపమార్గం పట్టిరచింది కాబట్టే ఈ చెట్టుకు

అపామార్గ సార్థకనామమయింది. శత్రువులను తప్పుదారి పట్టిస్తుందన్న విశ్వాసంతోనే రాజసూయ యాగం చేస్తారు. తైత్తిరీయ సంహితలో శత్రువుల మీద విజయానికి ఈ యాగం చేస్తారని చెప్పబడింది. రాజసనేయ సంహితలో ఉత్తరేణి – పాపసంహారిణి, రాక్షస సంహారిణిగా వర్ణించబడింది. అధర్వణ వేదంలో ఈ చెట్టు శత్రు సంహారిణియేగాక, ఆరోగ్య పరిరక్షిణి అనా జబ్బుల నయకారిణిగా చెప్పబడింది.

ఇది ఎఱ్ఱనేలల్లో, నల్ల నేలల్లో ఎక్కడ పడితే అక్కడ పెరుగుతుంది. ఉత్తరేణి ఆకుల రసం కడుపునొప్పికి, అజీర్తికి, మొలలకు, వ్రణాలు గడ్డలకు, చర్మపు పొంగుకు మంచి మందు. పూజావిధానంలో దీనిని ప్రముఖంగా వాడుతారు. మొత్తం శరీరాన్నే ప్రభావితం చేయగల శక్తి దీనికుంది. ఉత్తరేణి వేరులతో పళ్ళుతోమితే చిగుళ్లు, పళ్లు గట్టిపడతాయి.

ఉత్తరేణి ఆకుల రసం కడుపు నొప్పికి, అజీర్ణానికి, మొలలకు, వ్రణాలు గడ్డలకు, చర్మపు పొంగుకు మంచి మందు. పూజలకు దీనిని ప్రముఖంగా వాడుతారు. మొత్తం శరీరాన్ని ప్రభావితంచేసే శక్తి దీనికుంది. ఉత్తరేణి వ్రేళ్ళతో పళ్ళుతోమితే చిగుళ్ళు పళ్ళు గట్టిపడును.

**Arjuna**



**6. అర్జున — తెల్ల మద్ది**

Terminalia arjuna,

Combrateceae.

కఫానికి, పిత్తానికి, వాతానికి ఇంకా గుండె జబ్బులకు దీని బెరడును వాడడం మంచిదని ఆయుర్వేద వైద్యులు చెబుతారు. వస్త్రగాయం చేసిన దీని బెరడు పొడితో పాలు, చక్కెర కలిపి వాడితే గుండె జబ్బులకు మంచిది. తెల్లటి, నున్నని బెరడుతో ఎంతో అందంగా వుండే ఈ చెట్టు మొదలును అరణ్యవాస కాలంలో సీతాదేవి కౌగలించుకొన్నదని రామాయణంలో వుంది.

గడ్డిజాతులలో ఒక రకం తెల్లగడ్డిని కూడ 'అర్జున' అని పిలుస్తారు. దీనిని పితృమేధ లాంటి పితృ కర్మలలో వుపయోగిస్తారు. ఇలాంటి కర్మ కాండ జరిపేటప్పుడు అనేక రకాల గడ్డిని చిన్న కట్టలుగా కట్టి అన్ని దిక్కులలో పెడుతారు. అలా పెడుతూ ఒక మంత్రం ఉచ్చరిస్తారు. "ఓ అర్జునా ! నీవు అన్ని ఓషదుల సారమని విజ్ఞులు చెబుతారు. కాబట్టి నిన్ను ఇక్కడ వుంచాను. యజ్ఞం కొరకు ఇక్కడుంచిన సంబారాన్నంతా ప్రభావితం చేయి."

దీనిని బట్టి పితృకర్మలలో అర్జున వాడకం వల్ల పితృదేవతలు సంతోషిస్తారని విశ్వసించ బడుతోంది.

తైత్తరీయ అరణ్యకములో అర్జున జంబుతో పితృమేధయజ్ఞ సంబారాలను కప్పివుచ్చాలనివుంది. అథర్వణ వేదంలో అర్జున రెల్లు మహోత్స్యం వర్ణించబడింది. అంతేగాక మంత్రప్రయోగంలో ఈ గడ్డితో ఏయే ముడులు వేయాలో వాటి వుపయోగం కూడ చెప్పబడింది. దీనిని బట్టి చూస్తే పితృమేధంలో దీని వుపయోగం రాక్షస చర్యల నరికట్టడానికేనని తోస్తుంది. అర్జున జమ్ముతో కప్పబడిన ఆహారం బలవర్ధకమవుతుందని కూడ శాస్త్రంలో చెప్పబడింది.



## 7. అర్క

**జిల్లేడు**

Calotropis gigantia,
Asclepiadaceae.

అర్క లేదా అర్కుడు అనగా సూర్యుడు. జిల్లేడు చెట్టుకు కూడ అదేపేరు. అమిత ఉష్ణం కలిగించు గుణము కలది కావున జిల్లేడు చెట్టుకు అర్క పేరు ఎంతో తగివున్నది. అంగిరసాది మునులు ఒక యాగం చేసి తద్వారా స్వర్గము పొందుతారు. స్వర్గానికి పోయే తొందరలో వారి దగ్గర వున్న ఘర్మం ఒలికి సమీపాన వున్న ఒక మేక మీద పడుతుంది. ఘర్మం అంటే మహావీర అనేపాత్రలో సలసలకాగుతున్న పాలు పెరుగుల మిశ్రమం. మహావేడిగల ఘర్మం తనమీద పడగానే ఆమేక ఆవేడికి తట్టుకోలేక గట్టిగా అరుస్తుంది. అంతమేరకు దాని చర్మం వూడి క్రింద పడుతుంది. అందులోంచి అనగా ఆ పవిత్ర ఘర్మం నుంచి పుట్టినది కనుక దానికి అర్క పేరు సహజ సిద్ధంగా వుందని శాయణుడు వ్యాఖ్యానించారు.

సామాన్యంగా హోమాలు చేసేటప్పుడు జుహూ మొదలగు కొయ్య పని ముట్లు వాడుతారు. కానీ మహాగ్ని చయన హోమంలో అంతర్భాగమయిన శత రుద్రీయ హోమం చేసేటప్పుడు మాత్రం పై నిబంధనలను త్రోసి పుచ్చి జుహూకు బదులు అర్క పత్రాలను వాడాలని ఆదేశించబడింది. జుహూ అనే పనిముట్టును ప్రకృతియాగములో వాడుతారు. వికృతియాగాలన్నీ ప్రకృతి ప్రకారం చేయాలని నిబంధన వుంది.

శతరుద్రీయంలో జిల్లేడు పత్రంతో మేక పాలు పోస్తూ హోమంచేస్తే పుత్రపౌత్రాది వృద్ధి కలుగుతుందని శ్రుతులు చెబుతున్నాయి. జిల్లేడు చెట్టు పుట్టుకలో పాల పాత్ర కూడా వుంది కాబట్టి జిల్లేడు ఆకు శతరుద్రీయహోమంలో పాలుపోసే ఒక పనిముట్టు అయింది.

జిల్లేడుకు అర్కపర్ణమని గూడ పేరు. పేరును బట్టే ఇది వేడిని కలుగజేసే చెట్టు అని తెలిస్తోంది. దీనికి వున్న మందార అనే మరొకపేరు ఇది మామూలు రోగహారిణి అని తెలియజేస్తోంది. ఆయుర్వేదంలో ఇది శరీరంలో వేడిని పుట్టించి తద్వారా అనేక రోగాలను హరిస్తుందని చెప్పబడింది.

భావప్రకాశికలో జిల్లేడు వాత, కుష్ఠ, కఫములు, కడుపులో బాధలు తొలగిస్తుందని చెప్పబడింది. దీనికి విషాన్ని హరించే గుణం కూడవుంది.

ఇది ఎక్కడ బడితే అక్కడ పెరుగుతూ కనిపించే చెట్టు. దీని వేరు, ఆకులు, పూలు మందుగా వాడుతారు. ఈ మొక్కలోని ప్రతిభాగం పనికి వస్తుంది. వేరు బెరడు చర్మరోగాలకు, పూలు దగ్గుకు, అస్మా (ఉబ్బ నము)కు, ఆకలి కలగడానికి వాడుతారు. కొద్దిగా వాడితే ఇది దివ్యౌషధం. రథ సప్తమినాడు సూర్య భగవానుని సంప్రీతికొరకు దీని ఆకులు భుజాల మీద శిరస్సు మీద పెట్టుకొని స్నానం చేస్తారు. సూర్యునికి జిల్లేడుకు విడదీయరాని అనుబంధం.



## 8. అశోక

**అశోక** Saraca indica.

Caesalpineae.

ఇది తోటలలో పెంచబడే పవిత్రమైన చెట్టు. దీని పూలు పొడి చేసి మంచి నీళ్లలో కలిపి త్రాగితే నెత్తురు బేదులు తగ్గుతాయి.

దీనిని అందమైన స్త్రీ కాలితో తన్నితే పుష్పిస్తుందని నమ్మకము. లంకలో రావణుని చెఱలో వున్నపుడు సీతాదేవి ఈ చెట్టుక్రింద వసించెనని రామాయణములో నుడివినారు.

భవనముల ముందు పెంచే ఎత్తైన "Polialthia longifolia"ను **అశోక** చెట్టని పొరబాటుగా గుర్తిస్తారు. నిజమైన **అశోక** చెట్టుకు ప్రకాశవంతమైన అందమైన ఎర్రనిపూలు పూస్తాయి.

Ashwatha
Pippala



## 9. అశ్వత్థ — పిప్పల

రావి చెట్టు

Ficus riligiosa,
Urti Caceae

ఈ వృక్షానికి పిప్పల అనేపేరు కూడ వుంది. బుద్ధగయలో ఈ చెట్టు క్రింద తపస్సు చేసి సిద్ధిపొంది గౌతముడు బుద్ధుడయినందువల్ల దీనిని మహాబోధిగా బౌద్ధులు పూజిస్తారు. హిందువులకిది ఎంత పవిత్రమయినదో ఆ సంగతి ప్రత్యేకముగా చెప్పబనిలేదు. రావిచెట్టు, వేపచెట్టు రెంటిని కలిపి పెళ్లిచేసి దాంతోపాటు నాగప్రతిష్ఠ చేసిన రచ్చబండలు ప్రతి గ్రామంలోనూ కనిపిస్తాయి. సంతానం కోసం వీటిచుట్టూ ప్రదక్షిణలు చేస్తారు. రావిచెట్టు స్త్రీమూర్తి. వేపచెట్టు పురుషమూర్తి. నిస్సంతులు వీటి చుట్టూ ప్రదక్షిణలు చేస్తే పీటి గాలి [redacted] వారు సంతానవంతులవుతారు. [redacted] అభిప్రాయం సనాతనులే [redacted] అధునాతనులు ఒప్పుకొంటున్నారు.

తైత్తిరీయ బ్రాహ్మణంలో ఈ చెట్టుకు 'అశ్వత్థ' పేరు రావడానికి రెండు కథలున్నాయి. అగ్నిదేవుడు అశ్వం రూపం దాల్చి దేవతలనుంచి దూరంగా పారిపోయి ఈ చెట్టులో ఒక సంవత్సరం పాటు దాక్కుంటాడు. గుఱ్ఱం రూపంలో ఆయన దాక్కున్నాడుగాబట్టి ఈ చెట్టుకు అశ్వత్థ అనిపేరు వచ్చింది. ఇంకొక కథ ప్రకారం దాక్కున్న వాడు అగ్ని కాదని ప్రజాపతి అవని చేశాడని వుంది. ఈ రెండు కథలను శాయణుడు కూడ వుదహరించాడు కాబట్టి ఈ చెట్టుకు [illegible] పేరు స్థిరపడింది. మహాగ్నిచయనంలో ఒక మంత్రం కూడ అగ్నికి ఆవాసం అశ్వత్థమని రూఢిచేస్తోంది.

అగ్న్యాధానం కోసం సేకరించే పదునాలుగు సంబారాలలో ఏడు సంబారాలను వృక్షాలనుంచే సేకరిస్తారు. అందులో అశ్వత్థము ఒకటి. యజ్ఞం చేయడానికి రావి పుల్లలను సేకరించడం ఇక్కడ నుంచే ప్రారంభమయిందని తెలిస్తోంది. అగ్ని తేజస్సుకు రావిపుల్లలు ప్రతీక. అగ్నిదేవుడు సంవత్సరం పాటు ఈ చెట్టులో గుఱ్ఱం రూపంలో దాక్కున్నందుకే ఈ చెట్టుకు ఆ తేజస్సు వచ్చింది.

అగ్నిని పుట్టించడానికి అరణి అనే సాధనాన్ని వాడుతారు. అది అశ్వత్థ కఱ్ఱతో చేయబడిందే. అయితే [illegible] అశ్వత్థము శమీవృక్షము మీద పెరిగినదయి వుండాలి. అంటే 'పారసైట్' అన్నమాట. అంటే జమ్మిచెట్టు మీద మొలిచిన రావిచెట్టు కఱ్ఱను తీసికొని అరణి తయారుచేసి, అందులో అగ్నిని వుత్పన్నంచేసి, యజ్ఞం చేస్తారు. అగ్నియొక్క దహనశక్తి వుద్ధృతాన్ని శమీచెట్టు తగ్గిస్తుందట. అందువల్ల శమీవృక్షానికి ప్రాధాన్యం వచ్చింది.

హోమానికి బ్రహ్మౌదనాన్ని తయారుచేసేటప్పుడు ఆ అన్నం [illegible]ట్టడానికి పచ్చిగావున్న మూడు రావి సమిధలు వాడతారు. అగ్నికి ఏడు నాలుకలట. అందువల్ల యజ్ఞానికి ఏడురకాల చెట్లనుంచి సమిధలు సేకరిస్తారు. అందులో రావి ఒక్కటి అని తెలిసినదే. సృష్ట్యాదిలో విష్ణుమూర్తి రావి పత్రం మీద పవళించి క్షీరసాగరంలో తేలుతూ వున్నట్టు పురాణాలలో చెప్పబడింది. కొన్ని చోట్ల వట పత్రం (మఱ్ఱి ఆకు) అని వుంది. అందుకే ఆయనను వట పత్రశాయి అని కూడ అన్నారు. మరొక చోట పార్వతీదేవి శాపంవల్ల విష్ణువు అశ్వత్థమయినట్టు చెప్పబడింది.

రావి ఫలములు పక్షులకు పశువులకు మంచి ఆహారం. పంచకూళ్ల కషాయంలో దీనిని కలుపుతారు. దీని ఆకులు, బెరడు, మొగ్గలు, జీర్ణకారిగా పనిచేస్తాయి. వ్రణాలు మాన్పుతాయి. దీని పాలు పాదాలపగుళ్లకు చర్మపగుళ్లకు పూస్తే అవి నయమవుతాయి. చర్మరోగాలకు సంభోగ రోగాలకు ఇది ఎత్తిన గురువు. అన్నిటికీ మించి స్త్రీ పురుషుల్లో ఉత్పాదన ఉత్తేజన శక్తి కలిగిస్తుంది. సంతానం కలుగజేస్తుంది. ఉన్మాదం తగ్గిస్తుంది. అన్నివిధాలా వుపయోగపడే ఈ వృక్షం భారత దేశమంతా పెరుగుతుంది.

## 10. అతసి

సీమ అవిశ — Linum Vsitissium, Papilionaceae.

దీని పూలు చూచి ఇది మూడు రకాలుగా వుంటుందని చెప్పవచ్చు పూలు తెలుపు, ఎరుపు మరియు గోధుమ రంగులో వుంటాయి. ముచ్చటగా వుంటాయి. గింజలనుంచి లిన్‌సీడ్ ఆయిల్ తీస్తారు. ఇది బేదులకు, నెత్తురు బేదులకు మందుగా పనికి వస్తుంది. ఈ నూనెను, సున్నపు తేటను సమపాళ్లలో వాడి కాలిన గాయాలకు తద్వారా కలిగిన వుండ్లకు పూస్తారు. హిస్టీరియాకు, జలుబుకు ఈ చెట్టును కాల్చి పొగ పీల్చడం మంచిది.

Badari



## 11. బదరీ – రేగు

అశ్విని దేవతలు రేగుపండ్లు వాడి ఇంద్రునికి బలం వీర్యం వృద్ధి పొందించినారు. అందువల్ల ఇంద్రుడు అందరినీ జయించగలిగాడు. ఈ పండ్లు అశ్వినిదేవతల కెంతో ఇష్టమయినవి. వీర్యాభివృద్ధిని కలిగించేవి. ఇంద్రుడు వాంతిలోంచి పుద్భవించినది రేగుచెట్టు అని మైత్రాయిణీ సంహితాకాఠక సంహితాలు తెలుపుతున్నాయి. శతపథ బ్రాహ్మణంలో – సోమరసం – తేజస్సు ఈ రెండూ ఇంద్రుని నుంచే పుద్భవించాయని చెప్పబడింది.

సౌత్రామణి మొదలగు పూజావిధానాలలో రేగు అటుకులు కలిపిన సురను ఇంద్రాది దేవతలకు సమర్పిస్తారు. అందువల్ల శుక్లాభివృద్ధి కలుగుతుంది. ఇది కఫ, వాయు, పిత్తాలను తగ్గిస్తుందని ఆయుర్వేదంలో చెప్పబడింది. ఎండు ఫలాలు మంచి జీర్ణకారి. మలబద్దకం తొలగిస్తాయి. బెరడు అతిసార వ్యాధిని నివారిస్తుంది. దీని వేళ్ల కషాయం జ్వరాన్ని నివారిస్తుంది. లేత ఆకులు దంచి కట్టితే గాయాలు పుండ్లు మానుతాయి. దీనిపళ్లు తింటే రక్తం శుభ్ర పడుతుంది. ఇది భారత దేశమంతా పెరిగే చెట్టు. హిమాలయాలలోని బదరీనాథ్ క్షేత్రానికి ఈచెట్ల వనం వల్లనే ఆ పేరు వచ్చింది.

ఈ చెట్టు భారత దేశములోని అన్ని ప్రదేశములలో పెరుగును. దీని పళ్ళు రక్తమును శుభ్రపరుచును. తిన్న ఆహారము బాగుగా జీర్ణమగునట్లు చేయును. బెరడు అతిసారవ్యాధిని నివారించును. దీని వ్రేళ్ళను నీళ్ళలో కాచి కషాయమును త్రాగిన జ్వరము నివారణమగును. దీని లేత ఆకులను దంచి కట్టిన, గాయాలు, పుండ్లు మానును.



12. భృంగ రాజ

గుంట [redacted]

Eclipta prostrata,
Compositae.

బురద ప్రదేశాలలో ఈ మొక్క పెరుగును. దీని వేరును ఎండ బెట్టి పొడిచేసి, ఆ పొడిని పలురకముల చర్మవ్యాధులకును, కాలేయము వాపుకు వాడెదరు. బోదకాలు కురుపు నివారణకు, ఈ మొక్క పచ్చి ఆకులను మవ్వుల నూనెతో కలిపి పూసిన గుణము కలుగును. పశికర్లకు (జాండిస్) జ్వరములకు ఈ చెట్ల ఆకుపసరు వాడెదరు.



## 13. బిల్వము

మారేడు – త్రిపత్ర　　　　　　　　　　　　　　Aegle marmelos,
Rutaceae.

శ్రీ లక్ష్మీదేవి తపస్సువల్ల బిల్వవృక్షము పుట్టింది. మైత్రాయిణీ సంహితలో సూర్యరశ్మిలోనుంచి ఈ చెట్టు పుట్టిందని వుంది. కానీ శతపథ బ్రాహ్మణంలో ప్రజాపతి మజ్జలోనుంచి ఈ చెట్టు వుద్భవ మొందినదని వ్రాయుబడివుంది. బ్రహ్మ వర్చస్సు పొందడానికి సూర్యుని మెప్పుకోసం చేసే కామ్యయాగంలో బిల్వకొయ్యను యూపముగా (స్తంభముగా) నాటుతారు. అశ్వమేధ యాగములో ఇలాంటి యూపములను ఆరింటిని ప్రతిష్ఠించుతారు. వీటివల్ల బ్రహ్మవర్చస్సు వస్తుందని ఇలా చేస్తారు. నిజానికి బ్రహ్మవర్చస్సుకు ఈ మారేడు చెట్టుకు లంకెవుంది. పైగా ఇది లక్ష్మీదేవి తపస్సులో సిద్ధించింది, 'బిల్వనిలయా' అయిన ఆమె ఇందులో నివసిస్తుందిగాబట్టే దీనికా

శక్తివుంది. అన్నాద్య కామములు అనుభవించడానికి కూడా ఇది శక్తిని కలుగచేస్తుంది.

అటవికుడొకడు ప్రాణాపాయంనుంచి తప్పించుకోవడానికి బిల్వవృక్షాన్ని ఎక్కి రాత్రంతా మేలుకొనవలసవచ్చి బిల్వ పత్రాలను త్రుంచి వేయగా [redacted] క్రిందనున్న శివలింగం మీద పడి లింగోద్భవ శివుడు ఆవిర్భవించి [redacted] శివరాత్రిగా ప్రఖ్యాతిగాంచడం అందరూ ఎఱిగినదే. మారేడు ఫలములు, ఆకులు సాత్విక గుణాన్ని కలిగిస్తాయి. బిల్వ పత్రాలలో అనేక రకాలున్నాయి. మూడు, ఐదు, ఏడు, తొమ్మిది ఇలా ఆకులు కలిగిన వృక్షాలు మనం చూడవచ్చు.

ఈ చెట్టు భారత దేశమునందంతటను పెరుగును. ఇది హిందువులకు పూజ్యనీయమైనది. ఈ పత్రములు లేనిదే శివపూజ జరుగదు.

దీని పండ్లు, కాయలు, బెరడు, వ్రేళ్ళు, ఆకులు, పూవులు అన్నియు ఔషధములకు పనికివచ్చును. అతిసార వ్యాధికి, విరేచనములకు దీని పండ్లు చాలా మంచి మందు. ఆయుర్వేదములో వాడు దశమూలములలో దీని వేరు ఒక్కటి. మొలలకు యిది మంచి ఔషధము. "బిల్వపంచకము" బిల్వ రసాయనము, దీని పళ్ళతో తయారు చేసి వాడిన విరేచనములు వెంటనే కట్టును. దీని ఆకుల రసము అప్పటి కప్పుడు వాడిన చక్కెర వ్యాధి నివారణకు చాలమంచిది. ఈ చెట్టును ఇంటి ముంగిట పెంచుకొనిన చాలా ఆరోగ్యదాయకముగానుండును.

శ్లో|| త్రిదళం త్రిగుణాకారం త్రిదేత్రంచ త్రియాయుధం,
త్రిజన్మ పాప సంహారం ఏకబిల్వం శివార్పణం ||
శ్లో|| బిల్వానాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం
అఘోర పాప సంహారం ఏకబిల్వం శివార్పణం ||
—శ్రీ శివకవచస్తోత్రమంత్ర రాజము



## 14. బృహతి

It is a herb common all over India

నేల ములక Solanum Indicum,

Solanaceae

ఈ చెట్టు భారత దేశమంతటా లభించును. ఆయుర్వేదములోని దశమూలములలో దీనివేరు ఒకటి. ఇది మూత్రము సరిగా వచ్చునట్లు చేయును, దగ్గును ఉబ్బసమును నివారించును.

cough.

Champak

## 15. చంపక్

Michelia rheedi,

Magnoliaceae.

దక్షిణ భారతదేశములో పెరుగు ఒకరకమైన చంపకము. దీని పూవులను నూనెలో కాచి, తలనొప్పికి కంటి జబ్బులకు వాడెదరు.

Champaka



మాను సంపంగి

## 16. చంపక

Michelia champaca,

Magnoliaceae.

ఇది భారత దేశములోని సతత హరితారణ్యములలో సహజముగా పెరుగును. మంచి సువాసనగల పుష్పములకై దీనిని తోటలలో పెంచెదరు.

దీని బెరడు కషాయమును కడుపు నొప్పులకు వాడెదరు. దీని వేరు చేదుగానుండి బేది మందుగా వుపయోగపడుతుంది. క్రిమి సంహారమునకై ఈ చెట్టు ఆకుల రసమును విత్తనములను వాడెదరు.

[redacted] చెట్లు తిరుమల క్షేత్రములో సమృద్ధిగా పెంచబడి, కొండ నంతయు సువాసనభరితముగా చేయుచు యాత్రికులకాహ్లాదము గలుగ జేయుచున్నవి.

## 17. ఛాయ

Aerua Lanata,

Amarantaceae.

దక్షిణ భారతమున సామాన్యముగా కనిపించుచుండు, [redacted] చెట్టును మూత్రము సక్రమముగా వచ్చునట్లు చేయుటకు వాడెదరు.

## 18. చూత

మామిడి

Mangifera indica,

Anacardiaceae.

ఈ పండ్ల రసం డిఫ్తీరియా మరియు గొంతు వ్యాధులకు బాగా పని చేస్తుంది. గొంతు పూడుక పోతే, ఈ ఆకులు వుడికించి [redacted] నీళ్లతో తేనె కలిపి త్రాగితే నయమవుతుంది. చిగురాకులు ఎండబెట్టి పొడి చేసి కొని వాడితే చక్కెరవ్యాధి (మధుమేహం)కి పనిచేస్తుంది. దీని బంక, కాళ్ల పగుళ్లకు పూస్తారు. ప్రతి శుభకార్యానికి గుమ్మాలకు ఈ ఆకులు కట్టు తారు. వేసవిలో దీని ఫలాలు అన్నిచోట్లా ప్రముఖంగా అమ్ముడు పోతాయి. నాలుగైదు రకాల వూరగాయలు ఈ కాయలతో వేస్తారు. సుమారు 3500 సంవత్సరముల నాటిదిగా చెప్పబడే మామిడి చెట్టు ఒకటి కాంచీపురం శ్రీ ఏకాంబరేశ్వరస్వామి ఆలయం లోపల వుంది. దీని నాలుగు కొమ్మలు నాలుగు వేదాలు అంటారు. ఒక్కొక్క కొమ్మ ఒక్కొక రకం పండ్లు కాస్తుంది. అనగా తీపు, పులుపు, ఉప్పు, చేదు రుచులుగా వుంటాయి. దీని ఫలాలు భుజించిన నిస్సంతులకు సంతానం కలుగుతున్నట్టుగా ఆలయ అర్చకులు చెప్పారు. ఇది వేదకాలం నాటిదని కొందరి మతం.



దానిమ్మ **19. దాడిమ** Punica granatum, Lythraceae.

ఈ చెట్టును పళ్ళకై భారత దేశమంతటా తోటలలోను యిండ్లయందును పెంచెదరు. దీని పళ్లు అతిసార వ్యాధిని విరేచనములను నివారించుటకు వాడెదరు.

ఈ పళ్ళతో తయారు చేసిన లేహ్యమును మలేరియా జ్వరము, యితర జ్వరములను నివారించుటకు వుపయోగించెదరు. ఇది పిత్తహారిణి. దీని పూవుల రసమును, గరిక రసమును కలిపి ముక్కులలో నుంచి వచ్చు రక్త స్రావమును అరికట్టుటకు వాడెదరు,



## 20. దత్తూర

తెల్ల ఉమ్మెత్త

Datura alba,
Atropaceae.

ఈ మొక్క ఉష్ణ ప్రదేశంలో ఎక్కడ పడితే అక్కడ సహజముగా పెరుగుచుండును. దీనిలోని వివిధ [redacted] వాటి పూలరంగులు, తెలుపు, ఊదాలను బట్టి గుర్తించవచ్చును. [redacted] ఆకులను, ఉబ్బసము, కోరింత దగ్గు నివారణకు వాడెదరు. విత్తనాలను [redacted] కోశ వ్యాధులకు చర్మవ్యాధులకు వుపయోగించెదరు. "కనక అసవ" అను దగ్గులకు వాడే ఆయుర్వేదపు మందులో ఈ విత్తనములు ఒక భాగముగా నుండును. కీళ్ళ నొప్పులను తగ్గించుటకు ఈ చెట్టు ఆకుల రసమును వాడెదరు.



## 21. దవనము

Artmisia pallens, Compositae.

దక్షిణ భారత దేశములో ఈ మొక్కను విరివిగా పెంచెదరు. ఇతర వివరములకు వరుసనెంబరు 49 చూడండి.

## 22. దేవదారు

Cedrus deodarus, Pinaceae.

చాలా ఎత్తుగా వుండి అందముగా వున్నటువంటి ఈ వృక్షము హిమాలయ పర్వతములలో పెరుగుతున్నది. దీని చెక్కనుండి (Turpentine) వస్తుంది. దీనిని వ్రణములకు చర్మవ్యాధులకు వుపయోగించెదరు. దీని బెరడు జ్వరములకు, విరేచనములు కట్టుటకు వాడెదరు.

## 23. ధాత్రి

వివరములకు వరుసనెంబరు 2 చూడండి.



# 24. దూర్వ – గరిక గడ్డి

Cynodon dactylon,

Graminae.

ప్రజాపతి శరీరంలోని రోమములనుంచి దూర్వ (ఒక రకమయిన గడ్డి) మొలిచిందని జైమనీయ బ్రాహ్మణంలో వర్ణించబడింది. శతపథ బ్రాహ్మణం కూడ ఈ విషయం బలపరుస్తోంది. దీని శక్తి మేజిక్‌లాంటిది. భూమి మీద నాటితే ప్రతి గణుపు నుంచి చిగురించి అతి త్వరలోనే అంతటా అల్లుకుంటుంది. మట్టితో పెళ్లగించి మృత్తికా స్నానం చేస్తే (దూర్వామంత్రం చెబుతూ) పీడకలలు భూత ప్రేత పిశాచ దర్శనాలు అంతరిస్తాయి. మనను పట్టబడి మానసిక రుగ్మతలు తొలగి పోతాయి. ఈ విషయం తైత్తిరీయ ఆరణ్యకంలో వుంది.

దూర్వ క్రిమిసంహారిణి. అంటురోగాలనుంచి కాపాడుతుంది. చర్మరోగాలు రక్తపిత్తం, గజ్జి మొదలగు వాటిని నివారించడంలో ఇది అందె వేసిన చెయ్యి. దూర్వ అదూర్వమై ఒకప్పుడు ప్రజాపతి ప్రాణాలు తీసింది. తిరిగి అతని వెంట్రుకల ద్వారా అతని శరీరంలోనే ప్రవేశించి అతనిని కాపాడింది. అంతటి మహాత్మ్యం కలది కావుననే యజ్ఞ యాగాదులలో దీనిని విశేషంగా వాడుతారు. యజ్ఞం చేసేవారి వంశం దూర్వలాగానే విరివిగా, త్వరితంగా వ్యాప్తి చెందుతుందని విశ్వాసం.

ఈ అందమైన గడ్డి అన్ని ప్రదేశములందు పెరుగుతుంది. దీని రసము వాంతులను, విరేచనములు తగ్గించును. రక్తము కారు గాయములకు దీని రసమును ఉపయోగించెదరు. దీని వేర్ల కషాయము పూయమేహము (సిఫిలిస్) వ్యాధిని నివారించును.

**Drona**



## 25. ద్రోణ – తుమ్మి

Lucas aspera, Labiatae.

ఈ మొక్క అన్నిచోట్ల పెరుగును. దీని తెల్లని పూలను శివపూజకు వుపయోగించెదరు. ఈ పూవుల రసమును తేనెతో వాడిన జలుబు, దగ్గు నివారణమగును.



## 26. గణకి – కామంచికాయలు

Solanum nigrum. Solanaceae.

ఈ మొక్కలు భారత దేశమంతటను లభించును. దీని పళ్ళు నుండి ఆకులనుండి, కాండమునుండి అప్పటికప్పుడు తీసిన రసము గుండె జబ్బు, చర్మవ్యాధులకు, మొలల వ్యాధులను నివారించును. ఈ పళ్ళు పిల్ల దగ్గులను తగ్గించును. దీని ఆకు కూర లేక రసము త్రిదోష హారము.

## 27. గండలీక – సామలు

Panicum dactylum, Graminae.

దీని ఔషధ గుణములు గరిక గడ్డి గుణముల వలెనే వుండును.

Girikarnika
Shankapushpa



## 28. గిరికర్ణిక – శంఖపుష్పము

Clitoria ternata, Papilionaceae.

ఈ చెట్టు భారత దేశము అంతట లభించును. దీని వేరు విరేచనకారి మరియు మూత్రము సాఫీగా వచ్చుటకు తోడ్పడును. దీని విత్తనములు నరముల బలహీనతను పోగొట్టుటకు వాడెదరు.

## 29. ఇరువంతిక – మల్లె

Jasminum sambac, Oleaceae.

ఇది ఒకరకమైన మల్లె. సువాసనగల పుష్పములకై ఈ మల్లెను భారతదేశమంతటా తోటలలో పెంచెదరు. సుగంధ భరితమైన పూవులనుండి సువాసన తైలమును తీయుదురు. ఈ నూనెను దుర్గంధము వచ్చు చెవి, ముక్కు వ్యాధులనివారణకు వాడెదరు. ఈ చెట్టు ఆకులను, వ్రేళ్ళను, పూవులను నీరు తగులకుండ నూరి పుండు ఐన వక్షోజములకు పూసిన, ఎడతెరపిలేక పాలు స్రవించుట ఆగిపోవును.

## 30. జాజి

**Jasminum grandiflorum, Oleaceae.**

సువాసన పూలనిచ్చు ఈ తీగ భారత దేశమందంతట లభించును. దీని ఆకుల రసము త్రాగిన చర్మవ్యాధులు నశించును. దీని ఆకులు నమిలిన యెడల నోటిలోని పుండ్లు నివారణయగును. సువాసన నిచ్చు దీని పుష్పములనుండి తీసిన నూనె శరీరమునకు పూసుకొనిన చల్లదనమునిచ్చును.

**Jambeera**



## 31. జంబీర – దబ్బకాయ – గజనిమ్మ

Citrus limonum, Rutaceae.

ఈ చెట్టును పళ్ళకొరకు తోటలలో పెంచెదరు. దీని పండు యొక్క తోలును ఉదరకోశ వ్యాధులనివారణకు వాడెదరు. ఇది కూరల పులుసుగా వాడెదరు. దీని వూరగాయ అజీర్ణవ్యాధిని నివారించును.



## 32. జంబు – నేరేడు

Syzigium cumini, Myrtaceae.

ఈ వృక్షము భారత దేశమందంతటా పెరుగును. దీని పళ్ళ రసము, గింజల పొడి మధుమేహవ్యాధికి చాలా శ్రేష్ఠము. ఇది మూత్రము లోని చక్కెరను తగ్గించి మధుమేహరోగులకు కలుగు అతి దాహమును తగ్గించును. దీని మాను చెక్కరసము లేక కషాయము అతి సారము, నీళ్ళ విరేచనములు, జ్వరము తగ్గించును. దీని కషాయమును పుక్కిలించిన గొంతు పుండు నిమ్మళించును. దీని ఆకులను నూరి తేలుకుట్టిన చోట కట్టిన బాధ తగ్గును. దీని పళ్ళుతినిన యెడల మూత్ర సంచిలో రాళ్ళుపుట్టుట మానును. దీని ఆకుల చూర్ణముతో పండ్లుతోముకొనిన పండ్లు గట్టిపడును.



## 33. జప – మందార లేక దాసాని పుష్పము

Hibiscus rosasinensis, Malavaceae.

దీనిని పూలకై తోటలలోను ఇండ్ల ముంగిటను పెంచెదరు. దీని ఆకులకు ఆముదము పూసి వెచ్చ చేసి గడ్డలకి వేసిన మృదువు పరచును. నొప్పిని పోగొట్టును. దీని ఆకు పసరును లోపలి కిచ్చిన మూత్ర బద్ధకము పోగొట్టును. దీని వేరు నూరి నువ్వుల నూనెలో కలిపి గచ్చకాయంత మోతాదు యిచ్చిన స్త్రీల రక్తస్రావము కట్టును.

దీని పూవులు రెండుమూడు నేతిలో వేయించి యిచ్చిన స్త్రీల ఋతు రక్తస్రావము కట్టును. దీని పువ్వులను నలిపి పేను కొరికిన చోట దినమునకు రెండుమూడు సార్లు రుద్దుచుండిన యెడల అది మాని వెంట్రుకలు తిరిగి వచ్చును. దీని పువ్వుల రసమును కొబ్బరినూనెలో సమపాళ్ళలో పోసి నీరు యిగురువరకు కాచి తలకు పూసుకొనిన వెంట్రుకలు ఎదుగును, నల్లబడును.

## 34. జటధార – పిల్లి తేగలు

Asparagus racemosus, Liliaceae.

ఈ తీగ భారత దేశమందలి అన్ని అడవులలో లభించును. దీని వేరు అతిసారవ్యాధిని, చర్మవ్యాధులను నివారించుటకు ఉపయోగించెదరు. దీని వేరును పాలలో కాచి త్రాగిన [redacted] కల్గును. దీని ఆకుల రసము గనేరియా వ్యాధినివారణకు ఉపయోగపడును.

Kadali



## 35. కదళి – అరటి

Musa sapientum, Musaceae

ఇది చాలా బలవర్ధకమైన ఆహారము. మధుమేహవ్యాధి గ్రస్తులు పచ్చి అరటికూర తిన్న మంచిది. అరటి చెట్టు భస్మము ఉదరకోశ వ్యాధులను తగ్గించును. లేత ఆకులు గాయములపై వేసిన చలువ చేయును. దీని పువ్వుల రసమును పెరుగుతో కలిపి త్రాగిన స్త్రీలకు ఋతుస్రావము తగ్గును. అరటి చెట్ల ప్రాముఖ్యం అందరూ ఎఱిగినదే. చెట్టులో పనికి రాని భాగమంటూ ఏదీలేదు. సమస్తకార్యాలకు ఇది ఆలంబనం. శుభానికి [redacted] చిహ్నం. ఇది కల్పవృక్షంలా పనికి వస్తుంది.



## 36. కదంబ — కదంబము

Antho cephalus, Cadamba.

Rubiaceae.

దీని బెరడును కషాయముచేసి వాడెదరు. దీని కాయల రసమును పిల్లలకు వాడిన ఉదరకోశ వ్యాధులు తగ్గును. దీని పళ్ళరసము జ్వరము వచ్చిన వాడెదరు. ఇది దాహమును తగ్గించును.

## 37. కల్హార — తామర

Nymphea nouchali, Nymphaceae.

ఇది చెఱువులు, కొలనులలో పెరుగును. దీని పూవులు వేడిని తగ్గించును. దీని వేర్లను, విత్తనములను తినెదరు.



# 38. కమలము

**Nelumbium skpeciosum, Nyınphaceae.**

ఇది నీటిలో పెరుగు మొక్క. దీని పువ్వులు మంచి సువాసనకల్గి అందముగా నుండును. దీని పుష్పములు, కేసరములు, కాడలు అతిసార వ్యాధికి, పసరికలకు, హృద్రోగములకు ఉపయోగించెదరు. దీని పువ్వుల రసము దగ్గుని వారణకు, మూల వ్యాధిగ్రస్తులకును, రక్తస్రావము తగ్గించుటకు వాడెదరు. విత్తనములను చర్మ వ్యాధులకు, కుష్ఠువ్యాధి నివారణకుపయోగించెదరు. దీని పూలు, ఆకులు, శ్రీగంధముతోకాని ఉసిరికాయల రసముతోగాని నూరి నుదిటికి రాచిన తలనొప్పి నిమ్మళము అగును. అందరు దేవుళ్లు దీనిని ప్రేమతో ధరిస్తారు. లక్ష్మీదేవి పద్మోద్భవ, పద్మదళాయతాక్షి, పద్మముఖి. పద్మము సూర్యునికెంతో ఇష్టమయినది. అతని స్పర్శతో వికసిస్తుంది. పూర్వము తిరుమలలో ఎన్నో పద్మాకరములు వున్నట్టు శాసనాలున్నాయి.



## 39. కాంచన — కొండ కసివింద

**Toddalia acculeata, Rutaceae.**

ఈ మొక్క దక్షిణ భారత దేశములో విరివిగా లభించును. మలేరియా జ్వరనివారణలో క్వైనైను కన్నా యీ మొక్క బాగుగా పనిచేయును. కాయలను వూరగాయచేసి తిందురు. వేర్లబెరడునుండి సువాసన గల నూనెను తీసెదరు.



## 40. కపిత్థ — వెలగ

**Feronia elephantum, Rutaceae.**

వెలగ పండు శ్రేష్ఠమైనది. దీని పచ్చికాయలు బేదులను ఆపుటకు ఉపయోగించెదరు. పంచకపిత్థ అను మందును - దీనిపూవులను, వేర్లను, ఆకులను, బెరడును, పళ్ళతోను కలిపి తయారుచేసెదరు. ఈ చెట్టు యొక్క పైన చెప్పిన 5 భాగములతో నూనెను తయారు చేసి శరీరాని కంతయును రాచుకొందురు. ఇది విఘ్నేశ్వరునికి ఇష్టమయిన పండు. తేనెతో కలిపిన వెలగపండు పైత్య నివారిణి.



## 41. కరవీర – గన్నేరు

Nerium odorum, Apocynaceae.

తెల్లటి, ఎరుపు, రంగుల అందమైన సువాసన నిచ్చు పూలకై ఈ చెట్టును పెంచెదరు. ఈ పూలు పూజకు పనికివచ్చును.

దీనివేర్ల బెరడు, గుండెజబ్బులకును, మూత్రవ్యాధులకును ఉపయోగించెదరు. దీనివేరును నూరి గాయములకు, కుష్ఠువ్యాధి నివారణకు వాడెదరు.



## 42. కస్తూరిక – కస్తూరిక బెండ

Hibiscus abelomoschus, Malvaceae.

ముష్కదానె అను పేరుతో పిలువబడు దీని విత్తనములను, ఔషధములలో పనికివచ్చు నూనెను తయారుచేయుటకు వాడెదరు. దీని విత్తనముల కషాయమును; నరాల సంబంధమైన వ్యాధుల నివారణకు ఉపయోగించెదరు దీని విత్తనములతో తీసిన గంధమును, పాలలో కలిపి శరీరమునకు రాచుకొన్న దురద జబ్బు నివారణమగును.



# 43. కేతకి – మొగలిపువ్వు

**Pandanus Odoratissimus, Pandanaceae.**

ఈ మొక్క, కాలువగట్లమీద స్వతసిద్ధంగా పెరుగును. మంచి సువాసనగల పూలనిస్తుంది. దీనిలో తెల్లపూలనిచ్చేవి, పసుపు పచ్చ పూలనిచ్చేవి రెండు రకాలున్నవి. తెల్లపూవులు శ్రావణమాసములో విరివిగాపూస్తాయి. పసుపుపచ్చ రకము పూలు మాఘ, ఫాల్గుణమాసాలలో సమృద్ధిగా లభిస్తాయి. మంచి సువాసన గలదియును, ఔషధములకు పనికి వచ్చు నూనెను ఈ పూవులునుండి తీస్తారు. ఈ నూనెను తలనొప్పి, కీళ్ళనొప్పి, చెవి నొప్పి, తగ్గించేందుకు వాడెదరు. వాత, కఫములను నివారించుటకు దీని విత్తనాలను ఉపయోగించెదరు. మొగలి రేకుల జడ అంటే పల్లెపడుచులకు ప్రాణం. శివలింగం ఆద్యంతములు కనిపెట్టడానికి విష్ణువు బ్రహ్మ బయలు దేరగా, బ్రహ్మకోరికపై మొగలి పూవు, బ్రహ్మ శివలింగం అంతం చెప్పి, శివునికోపానికి గురియై, పూజార్హతను కోల్పోయిన శివపురాణకథ అందరు ఎరిగినదే!



## 44. కోవిదార – ఎఱ్ఱమందార – కాంచన

Bauhinia, variegata, Leguminosae.

ఈ చెట్టు అడవులలో కనిపిస్తుంది. పూతోటలలో పెంచెదరు. దీని బెరడు, వేర్లు, ఆకులు, పూవులు మందులకుపయోగిస్తారు. మొగ్గలను ఎండ బెట్టి పొడిచేసి, విరేచనములను తగ్గించుటకును, మొలలను నివారించుటకు ఉపయోగిస్తారు. దీని పూవులు, పంచదారతో కలిపి తినిన, కడుపు శుభ్రపడి సుఖబేది కల్గును. దీని [redacted] యొక్క కషాయము కడుపులోని పుండ్లను తగ్గించుటకును, చర్మవ్యాధులను నివారించుటకును వాడెదరు.

## 45. కుముదము – తెల్లతామర – కుముదము

Nymphaea alba.

ఇది నీటిలో పెరిగి తెల్లని పూలనిచ్చును. దీనిని అతిసార వ్యాధిని నివారించుటకు వాడెదరు.

## 46. కుంద — మొల్లలు

Jasminum pubescens, cseaceae.

ఇది సముద్రతీర ప్రాంతాలలో పెంచబడే మంచి సువాసనగల పూల నిచ్చే మొక్క. దీని ఆకులను వేయించి నీళ్ళతో కలిపి చూర్ణముచేసి పుండ్లకు రాసిన నివారణము అగును. మందగించిన కంటిచూపును మెరుగుపరుచుటకు దీని వేర్లను వాడెదరు.

**Kurantaka**



## 47. కురంటక — ముల్లుగోరింట

Barlaria priontis, Acanthaceae.

ఈ మొక్క సతత హరితముగావుండి, చిన్నచిన్నముళ్ళతో గూడియుండును. రెండునుండి నాలుగు అడుగుల ఎత్తువరకు ఎదుగును. దీని పూవులు గంటాకారముగా నుండి, తెలుపు, ఎరుపు, పసుపు, నీలము మున్నగు రంగులు కలిగియుండును. దీని కొమ్మలను అప్పుడప్పుడు కత్తిరించిన ఎల్లప్పుడు మొక్క పుష్పభరితముగా నుండును.

దీని వేరులను మలాముచేసి పుండ్లకు రాచిన నివారణగల్గును. ఆకుల [illegible] [illegible] తేనెతో కలిపి వాడిన పళ్ళలోని రక్తస్రావము ఆగును. పళ్ళపొడిలో ఈ మొక్కను వుపయోగిస్తారు. గోరింటాకు గోళ్ల అందం ఇనుమడించడానికి [illegible] వాడతారు.

## 48. కురువాక — ముల్లుగోరింట

పై నంబరు 47 చూడండి.



## 49. మాచీ పత్రము — దవనము

Artmisia indica, Compositae.

ఈ మొక్క చల్లటి ప్రదేశమైన కాశ్మీరములోను, నేపాళ దేశమునందును బాగుగా పెరుగును. దీని ఆకులు పూవులు నుండి సువాసన కల్గిన నూనెను తీస్తారు. ఈ నూనెను తీసికొన్న ఎడల తిన్న ఆహారము బాగుగా జీర్ణమగును, ఆకలి పుట్టించును. ఈ నూనెను నరాల జబ్బు, ఉదరకోశవ్యాధులకు, మనోవైల్యమును, అలసటను నివారించుట కుపయోగిస్తారు.

## 50. మాధవీ — మాధవీలత

Jasminum arborescens, Oleaceae.

[redacted] తీగ దక్షిణ భారతదేశములోని ఉష్ణప్రదేశాలలో పెరుగును. దీని ఆకుల రసము దగ్గు నివారణకు ఇతర శ్వాసకోశ వ్యాధులను ఉపశమింప చేయుటకు వాడెదరు. [redacted] పేరు మన కావ్యాలలో ఎక్కువగా కనిపిస్తుంది.

# 51. మాలతి

**Jasminum angustifolium, Oleaceae.**

ఈ తీగ సముద్రతీర ప్రాంతాలలో బాగుగా పెరుగును. [illegible] తీగకు నక్షత్రాకారములోగల తెల్లటి సువాసనగల పూవులు పూస్తాయి. దీని వేళ్ళను పొడిచేసి పూసిన తామరవ్యాధి నివారణమగును, నూనె చర్మవ్యాధుల నివారణకుపయోగపడును.

**Mallika**



# 52. మల్లిక

**Jasminum officinale, Oleaceae.**

ఆహ్లాదకరమైన సువాసనగల తెల్లని పూవులనిచ్చు ఈ మొక్క భారతదేశమంతటా పెంచబడుచున్నది. దీని పూలనుండి సువాసన నిచ్చు నూనెను తయారు చేసెదరు. పరిమళద్రవ్యాలలో దీనిని ఉపయోగించెదరు. దీని నూనెను [illegible] రాచుకొనిన తలనొప్పి తగ్గును. దీని కాయులను మాదకద్రవ్యముగా వాడెదరు.



## 53. మందార — కోవిదార — కాంచనము

Bauhinia purpurea, Leguminosae.

దక్షిణ భారత దేశములో ఈ చెట్లు విస్తారముగా పెరుగును. దీనికి అందమైన ఎర్రటి పూలుండును. కావున తోటలలో పెంచెదరు, బాటలకి రువైపుల నాటెదరు. దీని బెరడును మూత్రవ్యాధుల నివారణకును, వేర్లు ఉదరకోశ వ్యాధులనివారణకును, వాడెదరు. పూవులు సుఖబేది కల్గించుట కుపయోగించెదరు.

## 54. మరుగ — మరువము

Origanum marjorana.

ఈ మొక్క భారత దేశమంతటా పెంచబడుచున్నది. దీని ఆకులనుండి సువాసననిచ్చు నూనెను తయారు చేస్తారు. ఆ నూనెను కీళ్ళనొప్పుల నివారణకుపయోగిస్తారు.

## 55. మరువక

వరుస నంబరు 54 చూడండి.

**Naga, Nagakeshara, Champeya**



# 56. నాగ, నాగకేసర – చంపేయ

Mesua ferrea. lyntti ferae.

ఈ వృక్షము [redacted] హరితారణ్యములలో, తూర్పు పశ్చిమ కనుమలలో పెరుగును. దీని బెరడు కషాయము ఉదరకోశ వ్యాధులు, శ్వాసకోశవ్యాధుల నివారణకుపయోగపడును. దీని సువాసనగల పూలనుండి అత్తరు తయారుచేయుదురు.



## 57. నాగవల్లి — తమలపాకు

Piper betle, Piperaceae.

తమలపాకు తీగను తేమగలవేడి ప్రదేశాలలో పెంచెదరు. ఈ ఆకులను పూజచేయునప్పుడు దేవునిముందు వుంచు కలశములో తప్పక ఉంచెదరు. తాంబూలములో ఉపయోగిస్తారు. భోజనానంతరము తాంబూల సేవనము మన సాంప్రదాయము.

ఈ ఆకుల రసమును గొంతునొప్పి నివారణకుపయోగిస్తారు. శ్వాసకోశవ్యాధుల నివారణకై దీని ఆకులకు నూనెరాసి కొద్దిగా వేడిచేసి ఎదపై ఉంచెదరు. దీని తాజా లేత ఆకులకు నేయిరాచి గాయాలకు కట్టెదరు. దీని ఆకుల రసమును చెవిలోపిండిన చెవినొప్పి తగ్గిపోవును. అపస్మారకమును నివారించుటకు దీని ఆకుల రసమును పాలతో కలిపి త్రాగించెదరు.



## 58. నంద్యవంద – నందివర్థనము

Tabernaemontana heyneana, Apocynaceae.

ఈ చెట్లు దక్షిణభారతదేశమంతటా మరియు బెంగాలు రాష్ట్రములోను తెల్లటి అందమైన పూలకై పెంచెదరు. దైవపూజకీపూలు పనికి వస్తాయి. పంటినొప్పి నివారణకు దీని వ్రేళ్ళు లేక వ్రేళ్ళ బెరడును ఉపయోగిస్తారు. కంటి జబ్బులను పోగొట్టుటకు ఈ ఆకుల రసమును కళ్ళలోపించెదరు. పుండ్ల వల్ల కలుగు నొప్పిని తగ్గించుటకు పుండ్ల మీద కూడ ఈ ఆకు రసమును పూస్తారు. ఈ పూవుల రసాన్ని నూనెలో కలిపి కళ్ళ జబ్బులను చర్మవ్యాధులను నివారించుటకు వాడెదరు.

## 59. నీలోత్పలము – నల్లకలువ

Nymphaceae lotus.

నల్లకలువ కమలము నీటిలో పెరుగును. దీని పూవులను వాంతిని, దగ్గును, తలతిరుగుటను తగ్గించుటకు వాడెదరు. దీని పువ్వులు మెదడుకు సంబంధించిన వ్యాధులకు వాడెదరు. దీని గడ్డలు తినిన మొదల మొలల వ్యాధి తగ్గును. దీని పువ్వుల కషాయము గుండె దడను తగ్గించుటకు ఉప యోగించెదరు.



# 60. నింబ – వేప

Azadirachta indica, Meliaceae.

ఈ చెట్టు భారతదేశములోని అన్ని ప్రదేశములలో పెరుగును. దీని వేరు బెరడుతో కషాయము చేసి పిల్లలకు త్రాగించిన కడుపులో వుండు ఏలిక పాములను, నులిపురుగులను చంపును. దీని పువ్వులను ఆకులను మెత్తగా నూరి నుదుటికి పట్టించుకొనిన తలనొప్పి తగ్గును. దీని విత్తనములు మేహ వాత నొప్పులను నివారించేందుకు వాడెదరు. మంత్రాలు, తంత్రాలు, జాతరలు, పొంగులు, పొంగళ్లు, పండ్లు తోమడాలు, వేపపిండి, వేపచమురు, బంక ఇలా అన్నిటికీ ఇది వుపయోగపడడం, మనకు ఆరోగ్యప్రదాయిని కావటం మన అదృష్టం.



## 61. నిర్గుండి – నీరువావిలి చెట్టు

Vilex trifolia, Verbenaceae.

ఈ చెట్టు దక్షిణ హిందుస్థానమున విరివిగా పెరుగును. దీని ఆకులను వేడిచేసి కట్టిన మేహవాతములు, వాపులు, బెణుకులు తగ్గును.

## 62. పద్మ

Nilumbium speciosum, Nymphaceae.

[illegible] నంబరు 38 చూడుము.



## 63. పలాష -- మోదుగ

Butea fronaosa, Legunuuosae.

దీని బెరడునుండి వచ్చు రసమును పుచ్చుకొనిన అతిసారవ్యాధి, నీళ్ళ విరేచనములు తగ్గును. దీని ఆకులు మొటిమలను తగ్గించుటకు పుండ్ల నివారణకు వాడెదరు. దీని బెరడు కషాయము దగ్గు పడిశముల నివారణకు వాడెదరు.




## 64. పారిజాత

**Nictanthus artabotris, Oleaceae.**

ఇది మంచి సువాసనలో కూడిన తెల్లని పువ్వులనిచ్చు చిన్న చెట్టు. ఈ చెట్టు అక్టోబరు, నవంబరు మాసములో విరివిగా పుష్పించును. ఈ పువ్వులు రాత్రియందు వికసించి, ఉదయమునకు రాలిపోయి చెట్టుక్రింద తెల్లని తివాచి పఱచినట్లు కనపడును. ఈ పువ్వులలో నుంచి సుగంధ తైలమును తయారు చేసెదరు. తాజా ఆకుల రసమును పిల్లలకు బేదిమందుగా వాడె దరు. ఇది విశిష్టమయిన పుష్పవృక్షము గాబట్టి, దీనిని స్వర్గలోకమునుండి దొంగలించడానికి ప్రయత్నించి శ్రీకృష్ణుడు కష్టాల్లో పడతాడు. దీనివల్లనే పారిజాతాపహరణం కథ నడిచింది.



## 65. పాటలి – కలిగుట్టుచెట్టు

Stereospermum suavolens, Bignoniaceae.

దీని పువ్వులను తేనెలో కలిపి తీసికొనిన ఎక్కిళ్ళు తగ్గును. దీని బూడిదను క్షారజలములను తయారు చేయుటకు వాడెదరు.



## 66. పూగ – పోక

*Areca catechu, Arecaceae.*

పోక చెట్టు భారత దేశములోని ఉష్ణప్రదేశాలయిన కేరళ, కర్నాటక, అస్సాం రాష్ట్రములలో పెంచెదరు. దీని కాయలను జీర్ణకారిగాను, విరేచన కారిగాను వాడెదరు. ఎండిన వక్కపొడి పళ్ళ చిగుళ్ళకు బలమును కలిగించుటవలన పళ్ళపొడులలో దీనిని వాడెదరు. దీని వేరు యొక్క కషాయమును పెదవుల పుండ్ల నివారణకు వాడెదరు.

**reputed cure for sore lips,**



## 67. పున్నాగ – పొన్న

Calophyllum inophyllum, Guttifere.

ఈ చెట్టు భారతదేశములోని సముద్ర తీరములందు పెరుగును. దీని అందమయిన తెల్లటిపువ్వులు ఈశ్వరునకు చాలా ప్రీతికరమైనవని నమ్మకము. దీని [redacted] యొక్క రసము మంచి విరేచనకారి. దీని విత్తనములనుండి లభించు నూనె వాత నొప్పులను హరించును. దీని బెరడును గాయపరచినపుడు వచ్చిన బంక గాయములను, వ్రణములను ఉపశమింపచేయుటకు వాడెదరు. దీని విత్తనముల నుండి తీసిన నూనెను దేవాలయములలో వెలిగించు దీపములకు వాడెదరు. ఈ నూనెను పడవలకు పూసిన చెక్క చివికిపోకుండా కాపాడును.



## 68. సేవంతిక – చామంతి

Chrysanthemum indieca, Compositae.

చామంతిని పసుపు పచ్చ, తెల్లటి పువ్వుల కొరకు తోటలలో పెంచెదరు. ఈ పుష్పాలు మంచి [redacted] దేవపూజకు ఉపయోగపడును. దీని వేళ్ళను గనేరియా వ్యాధినివారించుటకు వాడెదరు.

The [redacted] is used in gonorrhoea.



## 69. శమి – జమ్మిచెట్టు

Acacia spicigera, Leguminosae.

ప్రజాపతి సమస్తాన్నీ సృష్టించినట్టే, అందులో భాగంగా అగ్నిని కూడ సృష్టించాడు. అగ్నిని సృష్టించగానే అది తన ప్రభావాన్ని చూపించసాగింది. తనను సృష్టించిన ప్రజాపతినే కాల్చసాగింది. దాంతో భయపడిన అతను పచ్చని చెట్టు కొమ్మలతో దానిని కొట్టి ఆర్పివేయగలిగాడు. అలా అగ్నిని శమింపచేయడానికి వుపయోగపడిన ఆ వృక్షము శమీవృక్షమయింది. ఈ కథ మైత్రేయ సంహిత, శతపథ బ్రాహ్మణం, కఠక సంహిత, కపిష్ఠల కఠాసంహితలలో వుంది.

ఈ శమీవృక్షము అన్నిచోట్లా ముఖ్యంగా అడవులలో కొండవాలులలో పెరుగుతుంది. దీనికి ముళ్లు వుండటం వల్ల కంపలాగ కనిపిస్తుంది. అగ్న్యాధానములో సంచారంగా, మహాగ్నిచయనంలో సమిధగా దీనికి ప్రాముఖ్యం వుంది.

శమి అన్నిరకాల చెడు ప్రభావాలను తొలగద్రోసి శుభాలను కలిగిస్తుంది. ప్రశాంతతను చేకూరుస్తుంది. శరీరంలోని అధిక వుష్ణాన్ని తగ్గిస్తుంది. జఠరాగ్నిని రగిల్చి జీర్ణశక్తిని వృద్ధి పరుస్తుంది.

హిందువులు దీనిని పవిత్రమైన చెట్టుగా పూజిస్తారు. శ్రీరామచంద్రుడు రావణునితో యుద్ధము చేయుటకు ముందు శమి వృక్షమును పూజించెనట. అరణ్యవాససమయములో పాండవులు వారి ఆయుధములను మూటకట్టి జమ్మిచెట్టుపై ఉంచిరి. దీని బెరడు కషాయమును దగ్గు, ఉబ్బసవ్యాధుల నివారణకు ఉపయోగించెదరు.

Shatapatra

## 70. శతపత్ర – తామర

Nymphea pubescens, Nymphaceae.

తామర భారత దేశములోని చెఱువులలోను, కొలనులలోను పెరుగును. దీని వేళ్ళు కషాయమును రక్తపేళ్ళ వ్యాధులకు వాడెదరు.

Shreegandha



## 71. శ్రీ గంధము

Santalum album, Santalaceae.

ఎల్లప్పుడు పచ్చగానుండు అందమైన ఈ చెట్టు కర్నాటక తమిళనాడు రాష్ట్రములలో విరివిగా పెరుగును. పవిత్రమైన తిరుమలలో కూడా ఈ చెట్టు పెరుగును. దీని చేవ కలిగిన చెక్క టన్నుకు లక్ష రూపాయులకు పైగా విలువచేయును. ఈ కొయ్య రాతిమీద అరగదీసి గంధమును చర్మ వ్యాధులకు చమటకాయులను తగ్గించుటకు వాడెదరు. శ్రీ గంధము నూనె గనేరియా వ్యాధి నివారణకు వాడెదరు. శ్రీ గంధపు నూనె ఒక పాలు, రెండు పాళ్ళు ఆవనూనె కలిపి మొటిమలకు పూసిన అవి తగ్గిపోవును. ఇది మంచి సువాసన గలది.

**Sindhuvara**

## 72. సింధువార — వావిలి

Vitex negundo, Verbenaceae.

దీని [redacted] వాత సంబంధమైన నొప్పులకును శరీరము పైని వాపులను తగ్గించుటకు వాడెదరు. దీని ఆకులను తలగడ క్రింద వుంచి పడుకొనిన తలనొప్పి తగ్గును. దీని పువ్వులను కలరావ్యాధిని, జ్వరమును, కాలేయపు వ్యాధులను, గుండె జబ్బులను నివారించుటకు వాడెదరు. ఈ కొమ్మలను కొడవలి పిడులకు విశేషంగా వాడుతారు.

**Sugandharaja**



## 73. సుగంధ రాజా — లిల్లి

Polianthus tuberosa, Amaryllidaceae.

ఈ చెట్టు యొక్క అందమైన సుగంధ భరితమైన పువ్వులకోసమై తోటలలో పెంచెదరు. దీని పువ్వులను గనేరియా వ్యాధినివారణకు ఉపయోగించెదరు. దీని పువ్వులను పసుపు, వెన్నతో కలిపి మెత్తగా నూరి మొటిమల నివారణకు వాడెదరు.

**Surabhi**

## 74. సురభి [redacted] [redacted] – చిల్ల

**Strychnos potatorum, Logonaceae.**

దక్షిణ మరియు మధ్య భారత దేశపుటడవులలో విరివిగా పెరుగును. మురికి నీటిని శుభ్రపరచుటకు చిల్ల గింజలను వాడెదరు. చిల్ల గింజలు అతిసార వ్యాధి నివారణకు వాడెదరు.

**Suragi**



## 75. సురగి

**Ochrocarpus longifolius, Guttiferae.**

ఈ చెట్టు పశ్చిమ సముద్ర [redacted] ప్రాంతములో కెనరా నుండి కొంకణము వరకు పెరుగును. దీని పూవులు మంచి సువాసన కలిగివుండి పూజకు ఉపయోగించెదరు. దీని పూవులను సుగంధ తైలములు తయారు చేయుటకు వాడెదరు. దీని పండ్లు తినుటకు పనికి వచ్చును.

**astringent. They are used as fragrant adjuncts to [redacted] and medicated oils. Fruit is edible.**

## 76. సురపున్నాగ – రుద్రాక్ష

**Elaeocarpus Ganitrus.**

ఈ అందమైన చెట్లు బాటలకిరువైపుల, తోటలలోను పెంచెదరు. ఈ చెట్టు తెల్లనిపూలగుత్తులతో అందముగా కన్పించును. దీని విత్తనములు రుద్రాక్షలుగా వాడెదరు. దీని కాయలను వాత రోగములు నివారించుటకు వాడెదరు.

## 77. శ్వేత దూర్వా

**Panicum dactulum, Graminae.**

వరుస నంబరు 27 చూడుడు.

## 78. శ్వేత అర్క – తెల్లజిల్లేడు

**Calotropis procera.**

ఈ చెట్టు భారత దేశములోని బీడు భూములందు పెరుగుచుండును. దీని పూలు తెల్లగా నుండును. దీని వేర్లయొక్క బెరడు చర్మవ్యాధుల నరికట్టుటకు పనికి వచ్చును. దీని పూవులను ఉబ్బస రోగ నివారణకు దగ్గుల ఉపశమనమునకు వాడెదరు.



## 79. తమాల – దాల్చిన చెక్క

Cinnamomum zeylanicum, Lauraceae.

ఈ చెట్లు ఉష్ణ ప్రాంతపుటడవులలో పెరుగును. దీని ఆకులను సుగంధ ద్రవ్యములుగా వాడెదరు. దీని ఆకుల నుంచి తీసిన నూనెను పిండి వంటలలో మంచి సువాసన వచ్చుటకు వాడెదరు. నూనె పంటి నొప్పులకు వాడెదరు.



## 80. తిల – నువ్వులు

Sesmum indecum, Pedaliaeae.

తిల నుంచే తైలం వస్తుంది. పదం కూడ అలానే వుద్భవించింది. ఈ తిలలు అనగా నూవులు తెలుపు నలుపులలో వుంటాయి.

ప్రజాపతి ద్వాదశాహ క్రతువులు చేసి అమితంగా ధనరాశులు పొందాడు. అవిచూసి [redacted] యజ్ఞం చేసిన ఋతువుల అధిపతులు అందులో భాగం కోరినారు. అందుకు సమ్మతించి ప్రజాపతి పంచిన భాగాలలో, శిశిర ఋతువు భాగానికి తిలలు వచ్చాయి. తిలలకు పాప ప్రక్షాళన శక్తివుంది. అందువల్ల దీనిని యజ్ఞ యాగాదులు, పిండప్రదానము, తర్పణ క్రియలలో వాడుతారు. [redacted] దోషం కలవారు నవగ్రహాలలోని శనిని పూజించి నూవుల నూనెతో దీపారాధన చేసి నువ్వుల దానం చేస్తారు. [redacted] విధంగా వారికి ఆ దోషం తొలుగుతుంది.

నువ్వుల నుండి నూనె తీయుదురు. కూరలతో వాడెదరు. దీని నూనె పుళ్ళకు పూసిన ఉపశమనము కలుగును. నువ్వులతో బెల్లము కలిపి [redacted] మిడి చేయుదురు. దీనిని [redacted] మంచి పుష్టము కలిగించును. నువ్వులు అతిసార వ్యాధిని మొలలను తగ్గించుటకు వాడెదరు.



## 81. తులసి

Ocimum sanctum Labiatae.

"తులసీకాననం యత్ర యత్ర పద్మవనాని చ|
సాలగ్రామ శిలాయత్ర తత్ర సన్నిహితో హరిః||
తులస్యారోపితా సిక్తాదృష్టా స్పృష్టా చ పాలితా|
ఆరోపితా ప్రయత్నేన చతుర్వర్గ ఫలప్రదం||"

యన్మూలే సర్వతీర్థాని, యన్మధ్యే సర్వదేవతా,
యదశ్రీ సర్వవేదేషు, తులసీత్వం నమామ్యహం.

ఈ చెట్టు చాలా పవిత్రమైనదిగా హిందువులు వారి ఇండ్లయందు దేవాలయములందు దీనిని పెంచెదరు. దీని ఆకుల రసము జ్వరమును తగ్గించును. రక్తస్రావమును, అతిసారమును తగ్గించును. వాంతులను ఆపును.

ప్రేవులలో నున్న పురుగులను చంపును. దీని విత్తనములు ఆవుపాలతో కలిపి త్రాగించిన వాంతులు తగ్గును. ఆకులను నిమ్మ రసములో కలిపి చర్మవ్యాధులను అరికట్టుటకు వాడెదరు. తులసి వనములో [redacted] తిరుగు చుండిన శరీరారోగ్యము వృద్ధి పొందుటయేగాక అనేక రోగములను రానీయక శమింపజేయును. తులసీ తీర్థం కఫం తొలగించి గొంతును బాగుచేయును.

**Udumbara**



## 82. ఉదుంబర – మేడి—అత్తి

Ficus glomerata, Moraceae.

అత్తి చెట్టు అన్నిచోట్లా కనబడుతుంది. అత్తిపళ్లు, అత్తినీరా, అత్తి పాలు, ఆకులు, బెరడు అన్నీ వుపయోగపడుతాయి. యజ్ఞ యాగాదులలో అశ్వత్థమునకు, శమీవృక్షమునకు ఎంత ప్రాధాన్యత వుందో [redacted] [redacted] పిలువబడే ఈ అత్తిచెట్టుకు అంతే ప్రాధాన్యత వుంది. దేవాలయాలు మరమ్మత్తు [redacted] సంప్రోక్షణ జరిగేవరకు అసలు దేవున్ని బాలయాస్థానంలో అత్తి కొయ్యతో చెక్కి బాలాలయంలో పూజిస్తారు. కాంచీపురంలో నున్న వరదరాజపెరుమాళ్ (చిన్నకంచి [redacted] విష్ణుకంచి) ప్రస్తుత విగ్రహమూర్తికి మునుపు 'అత్తి వరదన్' అనే పేరుతో ఆస్థానంలో అత్తికొయ్యతో చేసిన వరదరాజస్వామిని పూజించేవారు. ఇప్పుడాస్వామి ఆనందసరస్సులో నిక్షిప్తంచేయబడి ప్రతి 60 సం|| (ప్రస్తుతం 40 సం||) ఒకసారి వెలుపలికి తీసుకరాబడి అందరికీ దర్శనం కలుగజేస్తారు. అంటే జీవిత కాలంలో ఒక దర్శనం అన్న మాట.

**దేవతలు ఒకచోట చేరి హవ్యము (దేవతలకీయబడిన అన్న సారము) పంచుకొంటూ వుండగా కొంత భాగం నేలమీద పడి అందులో నుంచి వుద్భవించింది ఒక చెట్టు. [redacted] [redacted] అనగా అత్తిచెట్టు. అన్న సారంలో నుంచి పుట్టినదిగాన అది ఏపుగా పెరిగి మహావృక్షమయింది. [redacted] వల్లే దానికి ఉదుంబర అనే పేరు వచ్చింది.**

యజ్ఞయాగాదులలో కొమ్మలు, కొయ్యలు, యూపములు (యజ్ఞపశువును కట్టే స్తంభము), కుర్చీలు, కొయ్యగరిటెలు ఇలా అన్నిటికీ అత్తికొయ్యను వాడటం గమనించ దగ్గ విశేషం. అత్తి చెట్టు వీరత్వానికి బలానికి సంకేతం.

అగ్న్యాధానము కొరకు సేకరించు ఏడు వృక్ష సంభారములలో అత్తి ఒకటి. ఒకానొకప్పుడు సరస్వతి దేవి దేవతలనుంచి విడిపోయి ఈ ఉదుంబర వృక్షములో దాక్కొన్నదట. అందు వల్ల యజ్ఞకాలములో ఈ అత్తి దండం ధరించిన ఋత్విక్కులకు వాగ్దాటికి అంతుండదు. దీనికి అగ్నిని శాంత పఱచు గుణము కలదు. అందు వలననే శవ దహనం తరువాత అస్థికలు ఏరడానికి ముందు దీనితో నీటిని పాలను అస్థికల మీద చల్లుతారు. యజ్ఞం కోసం వాడే ఏడు సమిధలలో అత్తి ఒకటి. పితృమేధంలో శవాన్నివుంచడానికి అత్తి బల్లను వాడుతారు. ఇలా యజుర్వేదంలో దీని వుపయోగాలు అనల్పంగా చెప్పబడినాయి.

ఈ వృక్షము దత్తాత్రేయుని నివాసమని నమ్మిక. దీని బెరడు ఆకులు, కాయులు అతిసార వ్యాధిని నివారించుటకు వాడెదరు. దీని కాయులు చెట్టు మొదలు నుండి తీసిన రసము మధుమేహ వ్యాధిని నివారించుటకు వాడెదరు. దీని విత్తనముల పొడిని తేనెతో కలిపి మధుమేహవ్యాధినివారణకు వాడెదరు. దీని బెరడు పుళ్ళకు పైపూతగా వాడిన పుళ్ళలోని విషమును హరించి నయము చేయును. దీని వ్రేళ్ళరసము వాపులను తగ్గించుటకు పైపూతగా వాడెదరు.



## 83. ఉన్మత్త – వెఱ్ఱి కుసుమ – బలు రక్కసి

Argemone mexicana, Papavaraceae.

ఇది సాధారణముగా బాటల వెంబడి మరియు పొలములలో లభించును. దీని రసము మరియు విత్తనములు, వ్రేళ్ళు మలేరియా జ్వరనివారణకు, పచ్చ కామెర్లకు వాడెదరు. విత్తనములు మరియు నూనె ఉబ్బస వ్యాధి నివారణకుపయోగపడును. గింజలు పసుపుతో నూరి గజ్జికి పూసిన ఆ తీట నయమగును.

## 84. ఉత్పల

వరుస నెం. 38 చూడండి.

( For details refer Sl. No. 38 )

**Vakula**
**Bakula**

Sapotaceae
Mimosops elengi



## 85. వకుళ — పొగడ

**Mimosops elengi, Sapotaceze.**

ఈ అందమైన వృక్షము, పశ్చిమ కనుమలలో విస్తారముగా పెరుగును. దీని సువాసనగల పుష్పములకై తోటలలో పెంచెదరు. దీని పూలనుండి సుగంధ తైలమును తీయుదురు. దీని విత్తనములు సుఖ విరేచనమునకు వాడెదరు. దీని పళ్ళతో, పూలతో మలాము తయారు చేసి వ్రణములు నయము చేయుటకు వాడెదరు.



## 86. వట — మఱ్ఱి

Ficus bengalensis, Moraceae.

ఈ వృక్షము భారత దేశమంతటా పెరుగును. దీని పాలు గాయములను కీళ్లనొప్పులను తగ్గించుటకు వాడెదరు. దీని ఊడల చివర్లను వాంతుల నివారణకు వాడెదరు. దీని [redacted] మధుమేహవ్యాధి నివారణకు వాడెదరు. దీని లేత కొమ్మలను పళ్ళుతోముటకు ఉపయోగించెదరు. అనంతపురంజిల్లా లోని "గూటి బయలు" [redacted] గ్రామమున ప్రపంచములో నంతటికి పెద్దదైన మఱ్ఱి వృక్షముగలదు. దీనిని తిమ్మమ్మ మఱ్ఱిమాను అంటారు.



## 87. వేణు

Ochlanda rheedi, Graminae.

వెదురుకు మరో పేరు వేణు. వెదురుతో తయారుచేయబడిందే కాబట్టి పిల్లనగ్రోవికి వేణువు లేదా మురళి అని పేరు.

దేవతల మీద కోపగించిన అగ్ని ఒకసారి వెదురుబొంగులోని ఖాళీ ప్రదేశంలో దాక్కొన్నాడు. అందువల్ల అతనికి తేజస్సు వచ్చింది. వీర్యాభివృద్ధి [illegible]. ఈ కారణంతో అగ్ని యజ్ఞయాగాదులలో వెదురును విశేషంగా [illegible]. 122 నెంబరు కూడ చూడుము.

ఈ రకమైన వెదురు సతత హరితారణ్యములలో పెరుగును. దీని నుండియే పిల్లనగ్రోవులను [illegible] చేయుదురు. దీని [illegible] ఆకుల రసమును తీసుకొనిన జీర్ణవృద్ధి కలుగును.

## 88. విష్ణుక్రాంతి

Evolulus alsinoides, Convalvulaceae.

ప్రకృతి సిద్ధముగా దక్షిణ భారతదేశమున పెరుగును. ఈ చెట్టు ఆకులు, కాండము కొమ్మలు అన్నిటినీ కషాయముచేసి వాడిన జ్ఞాపక శక్తి పెరుగును. జ్వరములను తగ్గించును. నరాల బలహీనతను తగ్గించును.

# 89. అంబష్ఠ – అడవి మామిడి

**Spondias mangifera.**

ఇది భారత దేశములోని అన్ని అడవులలో పెరుగును. వేసవి కాలములో ఆకులు రాలియుండినపుడు పుష్పములు పూయును. దీని పళ్ళు తినుటకు పనికి వచ్చును. పచ్చళ్ళకు కూడా పనికివచ్చును. దీని ఆకులు, బెరడు అతిసార వ్యాధిని తగ్గించుటకు వాడెదరు. దీని ఆకుల రసమును చెవినొప్పి నివారణకుపయోగించెదరు. దీని చెక్క యొక్క కషాయము గనేరియా వ్యాధి నివారణకు వాడెదరు. దీని పళ్ళు తినిన యెడల వ్రణములు నివారణయగును.

**Ankola**



# 90. అంకోలా – ఊడగ

Alangium lamarki, Alangiaceae.

దక్షిణ భారతదేశములోని అడవులలో ఈ చెట్టు పెరుగును. దీనిని వ్రేళ్ళయొక్క బెరడు పలు రకములైన విషములను హరించును. దీని వ్రేళ్ళ బెరడు గంజినీళ్ళలోను కొద్దిపాటి తేనెతోను కలిపి యిచ్చిన అతిసారవ్యాధి నివారణఅగును. దీని వేర్లకషాయమును నేతిలో రంగరించి కుక్కకాటుకు

యిచ్చెదరు. కీళ్ళ నొప్పులు పోగొట్టుటకు దీని వేర్ల బెరడునుంచి తీసిన నూనెను పైపూతగా వాడెదరు. దీని పళ్ళు చల్లదనమును కల్పించును. మరియు మంచి బలవర్ధకము.

## 91. దర్భ

**Saccharum spontaneum, Graminae.**

ఇది ఒక దీనితో తయారుచేసిన బావలను పూజచేయునపుడుపయోగించెదరు. దీని వేర్లు మూత్ర వ్యాధుల నివారణకు వాడెదరు. కాలిన చర్మము పైగూడ పూతగా వాడెదరు.

## 92. హింతాళ — ఈత

**Phoenix paludosa, Palmaecceae.**

ఈ చెట్లు సాధారణముగా దక్షిణ భారత దేశమందు బెంగాల్‌నందు పెరుగును. ఈత చెట్లనుండి తీసిన 'నీరా' దాహమును తగ్గించును. పైత్య ప్రకోపమును తగ్గించును.

## 93. కక్కోల

**Luvanga scandens, Rutaceae**

ఇది సతత హరితారణ్యములలో పెరుగు తీగ. దీని పళ్ళు మందులకుపయోగించు మాసెల తయారు చేయుటకుపయోగించెదరు. ఈ మాసెను తేలు కుట్టినపుడు బాధ, పుపశమనమునకు వాడెదరు.

## 94. కరస్కర — ముష్టి

**Strychnos nuxvomica, Logomaceae.**

ముష్టిగింజల చూర్ణము వాత జబ్బులకు, పక్షవాత జబ్బు నివారించుటకు వాడెదరు. దీని పచ్చి బెరడు కొద్దిగా వాడిన కలరా వ్యాధి సంబంధమైన అతిసారవ్యాధి నివారణయగును. ఎలుక కాట్లలోని విషమును హరించుటకు ముష్టి విత్తనములను దంచి లేహ్యముగా వాడెదరు.

**Karnikara**

## 95. కర్ణికార

Pterospermum acerifolium,

Sterculiaceae.

[illegible] వృక్షము పశ్చిమ కనుమలలో సతత హరితారణ్యములో పెరుగును. పసుపురంగులో సువాసనలు వెదజల్లు దీని పుష్పములను తెల్లబట్టకు వాడెదరు. మరియు అమ్మవారి మచ్చలకు  పూత మందుగా వాడెదరు.

**Khadira (Khair)**



## 96. ఖదిర — సండ్ర

Acacia catechu, Leguminosae.

యజ్ఞ మంత్రాలలో హోత్రు వుచ్చరించునది వషట్కారము. దాని అధి దేవత కూడ వషట్కారము. ఒకసారి ఈ వషట్కార దేవత గాయత్రీదేవిని [illegible] నరికింది. అప్పుడామె తలనుంచి ఒకరకమయిన ద్రవము స్రవించి నేలమీ దపడి అందులోనుంచి ఖదిరవృక్షము మొలిచింది. కానీ శత [illegible] బ్రాహ్మ

ణంలో ప్రజాపతి ఎముకలనుంచి ఈ చెట్టు పుద్భవించిందని పేర్కొనబడినది. అందువల్ల వేమో ఈ చెట్టుకు ఆ గట్టి తనము అబ్బింది.

యజ్ఞ యాగాదులలో ఈ చెట్టుకు [illegible] ప్రాధాన్యం వుంది. ఇది గాయత్రీదేవి [illegible] యజ్ఞాలకు అనుసంధానం చేస్తుంది.

ఈ చెట్టు భారతదేశపు అన్ని అడవులలోను పెరుగును. దీని చెక్క కషాయముతో కల్ను తయారుచేసెదరు. దీనిని తాంబులములో వాడెదరు. కల్ను కొద్దిపాటి మోతాదులో జాజికాయతో దాల్చిన చెక్క తోను కలిపి వాడిన యెడల పళ్ళనొప్పులు తగ్గును.

## 97. కృష్ణ – మిరియాలు

Piper longum, Piperaceal.

మిరియాల తీగలను కాఫీతోటలలో పెంచెదరు. మిరియాలపొడిని తేనెలో కలిపి యిచ్చిన ఉబ్బస వ్యాధి మరియు ఎక్కిళ్ళవ్యాధి తగ్గును. మిరియాలను సుగంధ ద్రవ్యముగా, కషాయములలో వాడెదరు



## 98. కృతమాల – రేల

Cassia fistula, Leguminosae.

ఈ చెట్లు భారత దేశములో అంతటా పెరుగును. వేసవి కాలములో చెట్టు బంగారు రంగు పూలతో ఎంతో అందముగా కనబడును. దీని కాయల గుజ్జు మలబద్ధకమును పోగొట్టును. దీని గుజ్జును కొద్దిగా చింతపండుతో గూడా కలిపి రాత్రి పడుకొను నపుడు తీసికొనిన సుఖవిరేచనమగును. దీని పూల కషాయమును గూడ కడుపు నొప్పి తగ్గించుటకు వాడెదరు. దీని వేర్లు హృద్రోగనివారణకుపయోగించును.



## 99. కుటజ – పాలకొడిసె

**Holarrhena antidysentrica, Apocynaceae.**

ఇది భారత దేశములో అంతటను సాధారణముగా పెరుగు మొక్క. దీని వేర్ల యొక్క [illegible] అమీబియాసిస్‌లో వాడెదరు. దీని కషాయమును మారేడు కాయలలో కలిపి వాడిన యెడల చీము నెత్తురు విరేచనములు తగ్గును. పంటినొప్పిని తగ్గించుటకు దీని బెరడు యొక్క వేడి కషాయముము పుక్కిలి పెట్టెదరు.



## 100. లకూచ – కమ్మరేగు

Artocarpus lakoocha, Moraceae.

ఈ వృక్షము ఉష్ణపు ప్రాంతపు అడవులలో దక్షిణ భారతదేశమందు అస్సాం బెంగాల్ రాష్ట్రములో విరివిగా పెరుగును. దీనిని పళ్ళ తోటలలో గూడా పెంచెదరు. దీని పళ్ళను పచ్చిగా గాని, ఊరగాయ గాని వేసి తినెదరు. దీని విత్తనములను విరేచనకారిగా వాడెదరు.

Lavanga

## 101. లవంగ — లవంగము

Syzigium Caryophllata, Myrtaceae.

ఈ చెట్టు నేరేడు [redacted] చెందినది. దక్షిణ భారత దేశములో ముఖ్యముగా పశ్చిమ కనుమలలో పెరుగును. లవంగమును సుగంధ ద్రవ్యముగా వాడెదరు. లవంగమును చప్పరించిన వాంతులు తగ్గును. కడుపులోని వికారము తగ్గును. లవంగపు నూనె పంటి నొప్పుల నివారణకు వాడెదరు.

Madhuka



## 102. మధూక — ఇప్ప

Bassia latifolia, Sapotaceae.

ఈ వృక్షము దక్షిణ మధ్య భారత దేశపు అడవులలో పెరుగును. ఈ పళ్ళు తినుటకు [redacted] పచ్చును. దీని విత్తనములనుండి నూనె తీసెదరు. [redacted] నూనె చర్మవ్యాధుల ఉపశమనమునకు ఉపయోగించెదరు. సబ్బులు తయారుచేయుటకు [redacted] ఉపయోగించెదరు. దీని ఎండు [redacted] బూడిదను నేతిలో కలిపి కాలిన గాయమునకు పట్టించెదరు. దీనిపూల కషాయము దగ్గు మొదలగు శ్వాసకోశవ్యాధులకు వాడెదరు. [redacted] పువ్వులతో సారాయి తయారు చేసి [redacted] వాడెదరు. దీనిని కామేష్టియాగములో కూడ వాడుతారు.

Padari



## 103. పాదరి

Stereospermum chelonoides, Bignoniaceae.

ఈ చెట్టు దక్షిణ భారత దేశములోని అడవులలో పెరుగును. దీని వేళ్ళు మందులలో బలవర్ధనిగా వాడెదరు. దీనిని తేలుకుట్టిన చోట రాచిన విషము తగ్గించును.

# 104. పనస

**Artocarpus heterophyllus.**

మంచి రుచికరమైన పళ్ళకై ఈ చెట్టును తోటలలో పెంచెదరు. పండిన [redacted] తొనలు చాలా తియ్యగా వుండును. దీని విత్తనములు బూడిదలో వేయించిన తినుటకు రుచిగా నుండుటయేగాక బలవర్ధకముగా నుండును. దీని వేరు విరేచనములు తగ్గించుటకు వాడెదరు. లేత ఆకులు లేత వేర్లు చర్మవ్యాధులను నివారించుటకు పనికి వచ్చును.

[redacted]



# 105. ప్లక్ష – అడవి జువ్వి

**Ficus infectoria, Moraceae.**

ఈ జువ్విచెట్టు దాదాపు మఱ్ఱి వృక్షంలాగ వుంటుంది. దేవతలు మొదట భూమి మీద నివసించేవారు. స్వర్గానికి పోవడానికి ఒక యజ్ఞం నిర్విఘ్నంగా చేస [redacted] స్వర్గం పొందారు. భూమిమీద మానవులు కూడా అలాచేస్తారే మోనని భయపడి ఒకయజ్ఞ పశువును నరికి దానిరక్తం మెదడు ప్రవాహంతో మనుషులరాకను అరికట్టడానికి ప్రయత్నించారు. అందులో నుంచే ప్లక్ష

మొలిచింది. దానికి యజ్ఞం అనే పేరుకూడ వుంది. యజ్ఞపశు రక్తంలోంచి పుట్టింది కావున దానికి ఆ పేరు వచ్చివుంటుంది. హోమానికి ముందు నఱకబడిన జంతు భాగాలను ఈ చెట్టు కొమ్మల మీద వుంచేవారు. దానివల్ల వాటికి కీటక బాధ తప్పుతుంది. మాంసాన్ని కుళ్ల చేసే సూక్ష్మజీవులు దరిచేరవు.

గంధర్వులు, అప్సరసలు ఇలాంటి చెట్లమీదనుంచే మానవులకు ఉన్మాదం కలిగిస్తారట. అందువల్ల ఈ జువ్వి గూటాలు హోమాలలో వాడితే వారు తృప్తిచెంది మానవులకు కీడు కలిగించరట. దేవతలకు హవిస్సు చేరడానికీ అటంకం వుండదట.

విరిగిన ఎముకలు అతుక్కోవడానికి, కఫ వాత పైత్యములు తగ్గించడానికి ఇది పనికి వస్తుంది. ఆయుధాల వల్ల గాయాలు తగిలితే దీని పాలు పండ్లరసములో కలిపి త్రాగితే తొందరగా నయమవుతాయి. ఇది అంటీసెప్టిక్, అంటీబాక్టీరియాగా పనికి వస్తుంది.

ఈ చెట్టు భారతదేశములో అన్ని అడవులలో పెరుగును. దీని బెరడును పంచవల్కలను తయారు చేయుటకుపయోగించెదరు. దీని బెరడు కషాయము పుక్కిలించిన నోటిపుండ్లబాధ ఉపశమించును.

## 106. ప్రియాలు – సారపప్పు

**Buchanania lanzan, Anacardiaceae.**

ఈ చెట్లు దక్షిణ మధ్య భారత దేశములో పెరుగును. దీని విత్తనములోని పప్పును మిఠాయిలు తయారు చేయుటలో వాడెదరు. దీని విత్తనములు చూర్ణమును మలాముగా తయారుచేసి చర్మవ్యాధుల నివారణకు ఉపయోగించెదరు.

## 107. రక్త చందనము – ఎఱ్ఱ చందనము

**Pterocarpus Santalinus.**

ఈ వృక్షము ఆంధ్రప్రదేశ్ రాష్ట్రములోని, చిత్తూరు, కడప, నెల్లూరు జిల్లాలలోను, చెంగల్పట్టు జిల్లాలోను పెరుగును. దీని బెరడు నుంచి గాయ

[redacted] రక్తమువలెనుండు ద్రవము స్రవించును. అందుకే దీనికి రక్తచందనమని పేరువచ్చియుండును. [redacted] చేవగలిగిన ఎఱ్ఱటికఱ్ఱను "షామిషేనము" వాద్యము తయారుచేయుటకు జపాను దేశస్థులు వాడెదరు. మంచి చేవగలిగిన కఱ్ఱ ఖరీదు టన్ను 50 వేల రూపాయలుండును. దీని ఎఱ్ఱటి చేవగలిగిన కఱ్ఱను పొడిగొట్టి పాలలో [redacted] సేవించిన మొలలవ్యాధి తగ్గును. దీని చూర్ణమును నీటిలో కలిపి కనురెప్పల మీద వుంచుకొనిన చలువచేయును. దీని కాయల కషాయమును రక్తవిరేచనములు కట్టుటకు వాడెదరు. దీని చెక్కనుండి మందులకు పనికివచ్చు నూనెను తీయుదురు.

## 108. రసాల — చెఱకు

**Saccharum officinarum, Graminae.**

భారత దేశములో అన్ని ప్రదేశములలో విరివిగా సాగు చేసెదరు. చెఱకు రసము ఆకలిని కలిగించును. జీర్ణ శక్తిని పెంపొందించును. చెఱకు [redacted] కొద్దిగా అల్లములో [redacted] తీసికొనిన ఎక్కిళ్ళు తగ్గును.



## 109. రోహిణి – సోమి

Soymida febrifuga, Meliaceae.

దక్షిణ భారత దేశపు అడవులలో ఈ వృక్షములు విరివిగా పెరుగును. దీని [redacted] గాలిన్ అమ్లము కల్గి యుండును. దీనిని విరేచనముల నరికట్టుటకు జ్వరముల నివారించుటకు వాడెదరు. దీని చెక్కయొక్క కషాయమును పంటినొప్పిని తగ్గించుటకు, కీళ్ళనొప్పులను, వాపులను తగ్గించుటకుపయోగించెదరు. ఇది ఏడు కరక్కాయ జాతులలో నొకటి.

## 110. సాల వృక్షము

Shorea robusta, Dipterocarpaceae.

హిమాలయ పర్వత శ్రేణుల క్రింది భాగము నందు, మధ్య భారతమునందు అడవులలో ఈ వృక్షము పెరుగును. దీని కఱ్ఱను గృహనిర్మాణములకుపయోగించెదరు. దీని బెరడునుండి వెలువడు రసము నరముల ఉత్తేజమునకుపయోగించెదరు. ఇది ఒకరకమయిన ఓకుకలప.

## 111. సప్తపర్ణి – ఏడాకులపాల

**Alstonia scholaris, Apocynaceae.**

ఈ వృక్షము ఉష్ణప్రాంతపు అడవులలో పెరుగును. దీని బెరడు రక్తవిరేచనము, అతిసారవ్యాధి, జ్వరము తగ్గించుటకు వాడెదరు. దీని బెరడునుండి వచ్చు పాలను వ్రణములకు, కీళ్ళ నొప్పులకు వాడెదరు.

## 112. సరళ

**Pinus Longifolia, Pinaceae.**

ఈ వృక్షము హిమాలయ పర్వతములలోను ఉత్తర పశ్చిమ భాగము లందు పెరుగును. దీని మొదలును గాయపరచినపుడు స్రవించిన ద్రవముతో టర్పెంటైన్ తయారు చేయుదురు. దీనిని చెవి గొంతు నొప్పి సంబంధ మైన వ్యాధులు నివారించుటకుపయోగించెదరు. దీనినే దేవదారు వృక్షము అంటారు.

## 113. సరుజ

**Canarum strictum, Burseraceae.**

ఈ వృక్షము దక్షిణ భారత దేశమందలి సతత హరితారణ్యములలో పెరుగును. దీనిని లేత పండ్ల రసమును పశాస్త్రిగా వాడెదరు. దీని చర్మవ్యాధులకు విశేషముగా వాడెదరు. కీళ్ళనొప్పుల నివారించుటకు దీనిని మువ్వుల మానెతో కలిపి వాడెదరు.



## 114. శింశుపా – జిట్టేగి

**Dalbergia latifolia, Leguminosae.**

ఈ వృక్షము దక్షిణభారత దేశములోని అడవులలో పెరుగును. దీని బెరడును గాయపరచి స్రవించు ఎఱ్ఱటి ద్రవమును గాయములకు మాన్పుటకు వాడెదరు. దీని కఱ్ఱ నల్లగా అందముగా వుండి కుర్చీలు, బల్లలు మున్నగువాటిని తయారు చేయుటకు వాడెదరు.

## 115. శిరీష – దిరిసెన

**Acacia speciosa, Mimosae.**

[redacted] వృక్షము దక్షిణమధ్య భారతదేశముందు పెరుగును. దీని బెరడు విత్తనములను రక్తవిరేచనములు కట్టుటకు మొలల వ్యాధి [redacted]గించెదరు. [redacted] పువ్వులు వ్రణములను వాపులను తగ్గించుటకు వాడెదరు. దీని యొక్క వ్రేళ్ళ బెరడును పళ్ళచిగుళ్ళను పటిష్టము చేయుటకు వాడెదరు.



## 116. సుగంధి – సుగంధిపాల

**Hemidesmus indicus, Asclepiadeae.**

ఈ [redacted] భారతదేశమంతటను పెరుగును. దీని వ్రేళ్ళను సరస పరిల్లా [redacted] పిలిచెదరు. దీనివి చల్లని పానీయములలో వాడెదరు. దీనిని ఆకలి మందగించినపుడు, జ్వరములలో చర్మవ్యాధులలో కీళ్ళనొప్పులకు వాడెదరు. దీని వ్రేళ్ళ కషాయము వాడిన రక్తము శుద్ధిపరచి శరీరమునకు మంచి బలము నిచ్చును.



## 117. స్యందన – నెమ్మి

Ougenia dalbergiodes, Leguminosae.

ఈ చెట్టు దక్షిణ మధ్య భారత దేశములోని ఆకురాలు అరణ్యములలో పెరుగును. దీని బెరడును గాయపరచిన వచ్చు జిగురును రక్తవిరేచనములు, అతిసార వ్యాధుల వుపశమనమునకు వాడుదురు. దీని బెరడు యొక్క కషాయమును మూత్ర కోశ వ్యాధుల నివారణకు వాడెదరు.

## 118. తాళ – తాటి

Borassus flabellifer, Palmae.

ఇది దక్షిణ భారత దేశమంతటను పెరుగును. ఈ చెట్టుయొక్క అన్ని భాగములు ప్రజలకుపయోగపడును. దీనిని పేదలపాలిటి కల్పవృక్షము అందురు. దీనితో కల్లును తాటి బెల్లమును తయారుచేయుదురు. సూర్యోదయాత్పూర్వము తీసిన నీరా మంచి బలవర్ధకము, మరియు విరేచనకారి. దీని వేర్లయొక్క కషాయము కడుపు నొప్పికి, ఎక్కిళ్ళు తగ్గించుటకు వాడెదరు. దీని బెరడు కషాయములో కొద్దిగా ఉప్పు వేసుకొని పుక్కిలించిన పంటి చిగుళ్ళను బలపరచును. వేసవి కాలమునందు వచ్చు దీని పళ్ళను ముంజలను విశేషముగా ప్రజలు వాడెదరు.

## 119. తిలక

Symplocos racemosa, Symplocaceae.

దీని బెరడును రక్తవిరేచనములను, అతిసారవ్యాధిని తగ్గించుటకు ఉపయోగించెదరు. దీని బెరడు యొక్క కషాయమును పుక్కిలించిన నోటి చిగుళ్ళవ్యాధులు మున్నగునవి తగ్గును.

## 120. తిందుక – తునికి

Diospyros melanoxylon. Ebenaceae.

ఇది భారత దేశమున అన్ని అడవులలో పెరుగును. దీని ఆకులను బీడీలను తయారుచేయుటకు వాడెదరు. ఈ ఆకులనుండి కొన్ని కోట్ల రూపాయల ఆదాయము అటవీశాఖకు వచ్చుచున్నది. దీని బెరడు యొక్క జిగురు కురుపులు వ్రణముల పై పూసెదరు. దీని బెరడును మిరియాలతో కలిపి సేవించిన జిగట విరేచనములు అతి సారము తగ్గుటయేగాక ఇది మంచి బలవర్ధకముగ గూడ పనిచేయును.



## 121. ఉద్దాలక — బంక ఇరికి

Cordia myxa, Boraginaceae.

ఈ చెట్టు భారత దేశమంతటా పెరుగును. ఈ చెట్టు కాయలు బంకగా నుండి దగ్గు నివారణకు రొమ్ముపవ్యాధుల నివారణకు వుపయోగపడును.

## 122. వంశ — పెద్దవెదురు

Bambusa arundinacea, Graminae.

దీనిని పెద్ద వెదురు, బొంగు వెదురు లేక ఆడవెదురు అని అందురు. లేత చిగుళ్ళతో ఊరగాయ పెట్టెదరు. దీనిని తినిన మంచి ఆకలి పుట్టును. మంచి జీర్ణకారికూడా. లేత చిగుళ్ళ రసమును వ్రణములు మానువుటకు పురుగులను వెలికి తీయుటకును వాడెదరు. దీని ఆకుల రసమును సువాసన నిచ్చు పదార్థములతో కలిపి వాడిన రక్తవాంతులు తగ్గును.

# 123. వేతస – వేము

Calamus rotang.

నీటి దేవత తన సారాంశం చెప్పమని అడుగగా ప్రజాపతి "వెట్సున" అంటారు. నీటిలో పెరిగే వేముకు ఆ పేరే స్థిరపడి "వేతస"గా మారి పోయింది. వేము అంటే మన ఇళ్లలో వాడే కుర్చీలు తయారు చేసే ఒక రకమయిన జమ్ము. ఈ వేముతో అన్ని రకాల పరికరాలు తయారు చేస్తారు. దీని కొమ్మలు, దీనితో తయారు చేసిన చాపలు మహాగ్ని చయనం, అశ్వమేధం లాంటి క్రతువులలో వాడుతారు. అంతే కాకుండా ఇది హోమాన్ని హవిస్సును పవిత్రం చేస్తుంది. మూత్రనాళ వ్యాధులకు, కుష్మరోగానికి, ఇతర చర్మవ్యాధులకు, జ్వరాలకు, వాంతులకు ఇది మందుగా పనికి వస్తుంది. విషాన్ని హరిస్తుంది. విష పురుగులను తొలగిస్తుంది.

ఉష్ణప్రదేశపుటడవులలో ఎక్కువ వర్షపాతమున్న చోట్ల పెరుగును. పండినకాయల గుజ్జు కషాయము గా పనిచేయును.

# 124. వికంకట

Flucortia montana, Bixaceae.

ప్రజాపతి [redacted] యజ్ఞం చేసిన చోట ఈ వికంకట మొలిచింది. ఈ చెట్టునుంచే సర్వ జీవరాసులు ఉత్పత్తి అయ్యాయని వాడుక. కానీ [redacted] బ్రాహ్మణంలో–సృష్టి అంతా పూర్తయ్యాక ప్రజాపతి యజ్ఞం చేశాడని అందులో మొదటి హోమం చేసిన చోటునుంచే ఈ చెట్టు పుద్భవమొంది నదని చెపుతోంది. ఇది ఏడు సమిధలలో ఒకటి. మంచి తేజస్సును ఇస్తుంది. దీని తీయని ఫలాలు అన్ని రోగాలను పోగొడతాయి. యజ్ఞయాగాదులలో దీని ఉపయోగం అనల్పం.

ఈ చెట్టు ఉత్తర కన్నడ కొంకణము ప్రాంతములో పెరుగును. దీనికాయలు తినుటకు పనికివచ్చును. దీని పండిన పళ్ళతో గుజ్జుతయారుచేసెదరు. ఇది మంచి జీర్ణకారియై ఆకలిని కల్గించును. పసికెరలవ్యాధి నివారణకు కూడ పనికివచ్చును.

